# Five Historical Playlets.

# చారిత్రనాటకపంచకము

ఇది

కాకినాడలోని మెక్లారెన్ హైస్కూలు
ప్రధానాంధ్రోపాధ్యాయుఁడగు
వింజమూరి వెంకటలక్ష్మీనరసింహారావుచే

రచియింపఁబడియె.

పబ్లిషర్సు

రామా అండ్ కో, ఏలూరు

రెండవకూర్పు

1926.

[వెల రు 0-8-0.

# అంకితము.

## గీతము.

సర్వరససౌరభములఁ బ్రసారమీను
వీరమతియను సంపెంగవిరిని, మహిత
సౌమ్యగుణగంధిలమగు కృష్ణాకుమారి
యనెడు విరజాజిసుమమును, స్వార్థమగు సు
వాసనాసంతతినివీడి ప్రథితిఁగన్న
పున్ననానొప్పుమల్లికాపుష్పమును, సు
శౌర్యపరిమళప్రకటనాశక్తిమించి
యశముఁగనిన వీరాబాయియన్గులాబి
పువ్వును, నైర్మల్యలావణ్యముల నిధాన
మగునసామాన్యయను ధవళాంబుజమును
నీచరణపూజకర్పింతు నెమ్మిఁ గొనుము
పరమపావనచరిత్ర! యో భరతమాత!

# FOREWORD.

This little book contains five short stories told in dialogic form. The themes which concern female virtue and courage are more or less historical and are inspiring. The book is, on the whole, well written and will afford very useful reading especially to girls.

5-3-1919. (Sd) **JAYANTI RAMAYYA.**

*Rtd., Deputy collector.*

---

# అభిప్రాయము

మన బాలురును బాలికలును మన దేశమునందలి పురుష రత్నములయు నారీమణులయు నుత్తమచారిత్రములను జదివిన వారి హృదయకమలముకుళములు వికసించి ధైర్యాదిలక్ష్మికి నిలయములై విద్యాదేవికిఁ బీఠములై ప్రకాశించును. అందులో వీరమాతల పావనచరిత్ర లవశ్యము నెఱుంగఁదగినవై యున్నవి. యెఱుంగుటకు దృశ్యప్రబంధముల మూలముగానైన మఱింత

హృదయమునకు నాటును. దృశ్యప్రబంధములు హృదయముల బాగుగా వికసింపఁజేయునను సంగతిని ప్రబోధ చంద్రోదయపు చరిత్రే బాగుగా బోధచేయుచున్నది. వేదాంత మెన్నిసారులు తన శిష్యులకు బోధించినను వారికి బాగుగా నంటకుండుటచే వారికి లెస్సగా నయ్యెడి బోధలోనికి వచ్చుటకై కవి ప్రబోధ చంద్రోదయమును విరచించి ప్రదర్శింపించెననియు నందుమూలముగా నాతని శిష్యులు వేదాంతమును జక్కఁగా గ్రహించిరనియుఁ బెద్దలు చెప్పుదురు. కాన దృశ్యప్రబంధములు విషయమును హృదయముల బాగుగా నాటఁజేయుననునది నిర్వివాదాంశము. శ్రీ వింజమూరి వెంకట లక్ష్మీనరసింహారావుగారు వ్రాసిన "చారిత్రనాటకపంచక" మీ విషయములో బాగుగా నున్నది. కవిత మృదువుగను బఠనీయముగను నున్నది. ఇందు వర్ణింపఁ బడినవి వీరనారుల చరిత్రములు సంగ్రహముగా నుండియుఁ గవి యాశయమును జక్కఁగా బోధించునవిగా నున్నవి.

ఇట్లు,

కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి.

# పీఠిక

చదువరులారా!

నేనీ చిన్ని పొత్తమును బడులలోఁజదువు బాల బాలికా సంఘముల నిమిత్తమే ప్రచురించితిని. "ప్రతి దేశమునను జాతీయ గౌరవము నిలువఁ బెట్టుటకు జనసామాన్యమునకుఁ బరమనీతి బోధకము లగు పురాణేతిహాసములతోఁ బాటు చారిత్రకథలను నేర్పవలసి యున్నది. ఆకథలు కేవలవచనరూపమున వ్రాయుట కంటెఁ గద్యపద్యాత్మకముగ సంభాషణ క్రమమున వ్రాయుట మేలు. ఆరచనలు మిగుల పెద్దవిగనుండక సులభశైలితో నొప్పు చుండి బాలురుగాని బాలికలుగాని యొక గంటలోపునఁ బ్రదర్శింపదగినవై యుండుటలెస్స" యని యూహించి యీచారిత్ర నాటకపంచకమును రచియించి ప్రకటించితిని. ఒక దేశములో శేముషీమంతులు, శూరశిఖామణులు, కళాకోవిదులు మున్నగు పురుష పుంగవులు పుట్టుటకుఁ దద్దేశకాంతలయౌన్నత్యమే కారణము. ఒక దేశమభివృద్ధిలోనున్న దన నందలి స్త్రీలపరిస్థితి చక్కఁగ నుండుట చేతనే యని గ్రహింపనగును. పూర్వము మనహిందూ దేశముకూడ నభ్యున్నతదశయందుండుటకుఁ బ్రతిభాశాలినులగు మన హైందవనారీరత్నములే యని తెలుపుట కిందు శుభగుణశోభిత లగు [illegible] లలనాలలామలను గథానాయికలనుగాఁ దీసికొని యైదు నాటకములను రచించితిని. కావున నీపుస్తకము విద్య నర్థించు బాలికలకే కాక బాలురకును బఠనీయ గ్రంథమగును.

ఇందు నేను లాక్షణికులచే నియమింపబడిన నియమము లేమియుఁ బాటింపక ప్రకృతనాటక రంగమునఁ బ్రదర్శన యోగ్యములగు రీతిని మాత్రమే వ్రాసితిని. ఏఁటేఁట నుపాధ్యాయ శిక్షను బొందు క్రిందతఱగతి విద్యార్థులకు నాటకములు పఠనీయగ్రంథములుగా దొరతనమువారు నియమించు చున్నారు. అవి పెద్ద వగుటచేఁ బ్రదర్శనీయములుగా లేకపోవుటయేగాక, రెండు సంవత్సరములు చదువవలసిన విద్యార్థుల యభిరుచులు సుస్థిరములై యుండకున్నవనియు, బాఠశాలలయందప్పుడప్పుడు జరుగు సభలలోఁ బ్రదర్శించుట కనువగు చిన్ననాటకము లవసరములనియుఁ మఱియు నాలుగైదాఱవ ఫారములకు దొరతనమువారేర్పఱచు పఠనీయ గ్రంథములలో నిట్టి వావశ్యకములనియుఁ గొందఱు ప్రధానోపాధ్యాయమిత్రులు నాతోఁ జెప్పుటచే నేనీ పనికి దొరకొంటిని. కావున విద్యాభిమానముగల వారెల్లరీ గ్రంథమునకుఁ దగునాదరమునొసఁగి మఱియు నిట్టి గ్రంథముల రచించుటకు నన్నుఁ బ్రోత్సహింతురని నేను నమ్ముచున్నాను. ప్రమాదజనితదోషము లేవేని నిందున్నఁ గాంచిన మిత్రులు నన్ను మన్నించి వానిని నాకుఁ దెలిపినఁ బునర్ముద్రణమందు సవరించుకొందును.

కాకినాడ,
రామారావుపేట.
1-3-1919 సం॥

ఇట్లు
బుధజనవిధేయుఁడు,
వింజమూరి వెంకటలక్ష్మీనరసింహారావు.

# II

క్రీ॥ శ॥ 1858 వ సంవత్సరప్రాంతమున నుత్తరహిందూ స్థానమునందు జరిగిన సిపాయీల మహాకలహముతో హిందూ దేశమునందు చైతన్య మడుగంటినదని చెప్పదగును. కాని యీమధ్య నొకనూతన చైతన్యము ప్రజలయందుద్భవించినది. ఇప్పుడు దాని ప్రభావముచే దేశాభిమానమంకురించినది. దీని నభివృద్ధిలోనికి దెచ్చి వికసింపజేయుటకు బలువురు పలుమార్గ ముల నవలంబించు చున్నారు. దేశాభిమానమును పురికొల్పు గ్రంథముల రచించి చదువరుల హృదయముల కెక్కించుట యొక మార్గమై యున్నది. నాటకరచనమువలనను, నాటక ప్రదర్శనము వలనను దీనిని సాధింపవచ్చునను నమ్మకమెల్లవారికి గల్గు చున్నది. రసపుత్రవిజయము, శివాజీచరిత్రము, రాణీ సంయుక్త మొదలగు నాటకము లిందునిమిత్తము వ్రాయబడియుండుటచే జనుల మనముల నాకర్షించి యుత్సాహమును ప్రేరేపించు చున్నది.

నిక్కమగు దేశాభిమానము బాలురకును బాలికలకును నుగ్గుపాలతోనే జీర్ణింపజేయవలసియున్నది. దీనిని పురుషులు పూనుకొనుటకంటె స్త్రీలే యిట్టిసత్కార్యాచరణమునకు బూను కొన్న యెడల దేశాభిమానము వెంటనే వేరూని సద్యఃఫలము నియ్యగలదు. ఇందువలన స్త్రీవిద్యయొక్క యావసరము విశదమగు చున్నది. ఈగ్రంథకర్తకు తనసహధర్మచారిణి తోడగుటవలన

నిదివరకు పత్త్రికా ప్రచురణము వలన స్త్రీవిద్యాభివృద్ధికై కొంతపనిచేసి యిప్పుడు కొంతనూతనమార్గమును దొక్కుచున్నను దేశాభిమానమునకు నాటపట్టగుమహారాష్ట్రచరిత్రమును, రసపుత్రులచరిత్రమును నాధారముచేసికొని నాటకరచనకు దొడంగినాను.

అవక్రమగు పరాక్రమముచేతను, ఉపమానరహితమగు సాహసాతిశయముచేతను, కుంటువడని దేశాభిమానముచేతను, నిష్కలంకంబులగు ధైర్యగాంభీర్యాదిసద్గుణపుంజములచేతను, మహారాష్ట్రులును, రసపుత్రులును నన్నెగాంచియుండిరి. వీరి సుగుణరాజియంతయు మొగలాయీలచే రాపిడినిబొంది కాంతి హెచ్చియున్నది. కావున వీరిచత్రము నాధారముచేసికొని నాటకములరచించుట దేశమునకు మహోపకారమగుచున్నది. ఈనాటకములందలి ముఖ్యపాత్రములన్నియు స్త్రీలే యయి యున్నారు.

పాతివ్రత్యమువిషయమున శౌర్యప్రకటనమున వీరమతి సమానరహిత ; తనపవిత్రతనిల్పుకొనుచు దేశక్షేమమునకై స్వార్థత్యాగమొనర్చుటలో కృష్ణాకుమారి నిరుపమాన ; రాజభక్తి విషయమున తనకన్న కొమరుని గోల్పోయి ప్రభుకుమారుని ప్రాణములగాపాడిన పున్నాబాయి యద్వితీయ ; దేశాభిమానముచే. తన పెనిమిటిని యుద్ధమునకు బుద్దికొల్పినను నాతడు వెనుదీయుటచే స్వయముగా సేనల రణరంగముననడిపించె

యోటమిపొందియు నక్బరునిప్రాణముల హరింపజూచిన వీరా బాయి శౌర్యసాహసములయందు నిస్తుల ; శత్రువులచే తన ప్రాణప్రియుని ప్రాణములుదీయబడినను, నాతనికొమారై ప్రాణములుగాపాడిన యసామాన్య దయారసమునందు నిజముగా నసామాన్య. ఇట్టి స్త్రీరత్నముల కథానాయికలగావించి నాటకములరచించి ప్రదర్శింపించిన యెడ స్త్రీలోకమునకు మిగుల బ్రయోజకరముగానుండును. దేశాభివృద్ధికి ముఖ్యకారణము స్త్రీజాతియౌన్నత్యమునకు వచ్చుటయే. వారిమూలమున వారి సంతానమునకును, దేశాభిమానము, శౌర్యము, సాహసము, ధైర్యగాంభీర్యాదిగుణము లలవడును. సాధారణముగా మన లోని నాటకములన్నియు, సాయంతమునకు ప్రారంభించిన తెల్లవారువరకును నాడుట కనువై యున్నవి. నాగరకులగు స్త్రీలు నాటకప్రదర్శనముకొరకై యంతవరకు కాలమును వ్యయపరుప జాలరు. కావున నీనాటకములు గంట గంటన్నరలో ప్రదర్శిం చుటకు ననువుగానున్నవి. రసపుష్టికి ననవసరములగు నిర్బంధములగు నాటకలక్షణములను త్యజించి, పాత్రోచితములగు సంభాషణములచేతను, యాథాస్థానములందున్న కీర్తనముల తను, ద్రాక్షాపాకముగలవగుటచే సుగమములగు పద్యావళుల తను నీనాటకములు విరాజిల్లుచున్నవి.

ఇట్లు,

చిలకమర్తి లక్ష్మీనరసింహాచార్యులు. బి.ఏ.

# వీరమతి.

## ఇందువచ్చు పాత్రలు.

జగదేవుఁడు:—మాలవ దేశాధిపతియగు ఉదయాదిత్య మహా రాజు కొమారుఁడు—కథానాయకుఁడు.

ధీరసింహుఁడు:—జగదేవుని తల్లి సోళంకరాణిచేఁ బంపఁబడిన సేనానాయకుఁడు.

సుధర్ముఁడు:—పట్టణ సంస్థానాధిపతి.

లాలుదాసు:—సుధర్ముని కొత్వాలు కొడుకు.

వీరమతి:—టుకటోడా పురాధీశ్వరుఁడగు బిరజమహారాజుకూతురు—కథానాయిక.

జగద్ధవలుఁడు:—వీరమతి కొడుకు.

దొంగలు నల్వురు:—ఉదయాదిత్యుని పెద్ద భార్య వాఘేలి రాణిచేఁ బంపఁబడినవారు.

జామోతి:—మిండగత్తెయగు వేశ్య.

కఠోరకుఁడు, భీషణుఁడు:—పౌరులు.

## —• కథాసంగ్రహము. •—

శాలివాహన శకమందలి రెండు మూఁడు శతాబ్దములు మధ్యమున గుజరాతు దేశమున టుకటోడా పురమునందు బిరజుఁడను రాజేలుచుండెను. అతనికి సుందరాంగియు సుగుణవతి

యునగు వీరమతియను పేరు గల చెలియలు గలదు. ఆమెను మాళవ దేశము నేలు ఉదయాదిత్యుని రెండవభార్య కొడుకైన జగదేవునికిచ్చి వివాహము చేసెను. ఉదయాదిత్యుని పెద్దభార్య వాఘేలి రాణికిని రెండవభార్య సోళంకి రాణికిని మనస్పర్ధలుగలవు. రాజు పెద్దభార్యను ప్రేమించుచు రెండవభార్యనుగొడుకును నిర సించుచుండెను. తుదకు జగదేవుడు తండ్రిరాజ్యమును వదలి పోవలసివచ్చెను. అతడు తోడాకతోపునకుఁ బోయి బ్రతుకఁజూచుచుండ దారిలో నతని కెన్నియో యాపదలను సవతితల్లి గల్గింపబోయెను. అవి యన్నియు నతని సహధర్మచారిణియగు వీరమతి సహాయ్యమున నివారింపఁబడినవి. తుద కతఁడు పతివ్రతాతిలకమగు భార్యమూలమునను దన తెలివిదేటల మూలమునను బట్టణ సంస్థానమున కధిపతియై, యవల దండ్రిరాజ్యమునుం గొని కీర్తిఁ గాంచెను. అనుకూల భార్యావంతుల కెందును శుభములే కలుగునుగదా!

---

## ప్రథమ రంగము.

(రంగము:—టుకటోడాపుర పరిసరోపవనము—జగదేవుడు గుఱ్ఱము నెక్కి వచ్చుచుండును.)

జగ:—(తనలో) ఆహా! నా సవతితల్లి వలన నాకెట్టి విపత్తులు సంభవించినవి! తన యంతఃపురమునకు నిర్మల మనం

బుత్తో బోయిన నాపై నామె లేనిపోని నిందలుమోపి
నా తండ్రికి నాపై యేవపుట్టునట్లు జేసెగా!

తే-గీ. కుటిలవృత్తితో జిత్రాంగి • కొడుకు జేకి
లేనిపోని నిందలమోపి • హానిసేయ
బూనదే! యట్టి దుర్బుద్ధి • పుట్టెనేమొ;
కాదు వా రెంతపనికైన • నోడువారె!

కానిమ్ము నేనిప్పుడు పట్టణసంస్థానాధీశ్వరు నాశ్రయించి నావర్ణాశ్రమమునకుదగిన యధికారము సంపాదింప ప్రయత్నించెదను. ఈలోపున నా యర్ధాంగియగు వీరమతి నొకసారిచూచి యామె యనుజ్ఞవడసి మఱి పోయెదగాక. (అని గుఱ్ఱము నొక చెట్టునకు గట్టిపెట్టి, సమీపఫలవృక్షములందు వ్రేలాడు పరిపక్వఫలములగోసి భక్షించి సెలయేటియందలి నిర్మలజలముల గ్రోలి యొక వృక్షచ్ఛాయ విశ్రమించుచు).

ప్రవేశము:—నలువురు దొంగలు.

మొదటిదొంగ:—ఓరన్నా! మనం పుత్తకట్టం పొంతున్నాంరా. ఆజగదేడు గాండు అమ్మగోరి ఆలోసనలన్నీ తెల్సుకున్నా డుకామోలు. ఏసందుల్లో దాగేడో? ఏలోయల్లో పోతున్నాడో?

రెండవదొంగ:—నిజంరా. లేనిపోని సొద తెచ్చిపెట్టుకున్నాం. ఆడెంత టక్కరోడనుకున్నావు? సయిత్తల్లి తన్ను సంపడానికి యేరోన్నిపంపుతుందని తెల్సే యీసికుదాకట్టి పాఱిపోయాడు.

మూఁడవదొంగ:—కానీరా! తొందరపడకురా? ఇంకా యెత్తుకుదారి. ఓరదిగో! అదుగో! ఆచెట్టుక్రిందెవరో గుఱ్ఱంవుందిరోయి. ఆలాపోయి సూద్దాం రండిరా.

(నల్వురుసునిద్రించుచున్న జగదేవునిసమీపమునకుఁజనుదెంతురు)

నాల్గవదొంగ:— (మెల్లగా) ఓనాయ్? ఈడు జగదేవేరా! మనపున్నెంపుచ్చింది. పోలేరమ్మకు మనమీద దయొచ్చింది. ఈణ్ణి పట్టుకపోయి రాణీయొరికప్పసెప్పి, ఆతల్లిచ్చేడబ్బులో సగం అమ్మోరికి మేకపోతు లేటకింద కర్చుపెట్టాలి, రండాయ్! పట్టుకొందారి.

(వారు గాఢనిద్రయందున్న జగదేవుని పాశములచే బంధించి లేవనెత్తి మేనాలోనుంతురు. జగదేవుఁడు మేల్కొనును.)

జగ:—ఓరీ చోరులారా! ఇఁదుదానిపనిచెసితిరేమిరా? మీకు పౌరుషమున్నఁ గట్టుల విప్పి నాతోఁ బోరుఁడు. నన్ను జయించి కొనిపొండు.

దొంగలు:—మాట్టాడకయ్యా? మా సేతిలో సిక్కావు. ఇంకెక్కడికి పోతావు. ఓరే! ఈడిమాటల్తోయేమ్మనకు? మేనా యెత్తండి.

జగ:—ఆహా! నాస్థితి యెంతకు వచ్చినది. దైవమా! నీకేమి యెగ్గొనర్చితిని. నాపైఁ బంతము బూనెదవేల? నిన్ను నిరంతరము సేవించువారల నిట్లేఁచెదవా? లేక నన్ను మాత్రమే యిట్లు వెతలఁబెట్టుచున్నావా? నీవు

చెలి:—అమ్మా! అంతయు వాస్తవమే. మీతో నేనుగూడ నేకీభవింతును. భూతహింస మాన్పించుటకే తొల్లింటి యార్యులు మృగయ క్షత్రియ ధర్మములలో నొకటి యని పల్కిరి.

వీర:—సఖీ! వేటవేడుకలో మునిఁగి మనము ప్రొద్దుపోవుట కూడ నెఱుంగకపోయితిమి. అదే భానుఁడు పశ్చిమ దిక్కాంత యమర్చిన సింధూర వర్ణంపుఁ బాన్పుపై మేను వాల్పఁబోవుచున్నాఁడు. మనముకూడ మసలక బసలకుఁ బోదమురమ్మా.

సేవకుఁడు అమ్మా! ఒకగడియక్రింద నెవ్వఁడో రాచవాఁడు, ఆచెట్టునీడఁ బవ్వళించియుండెను. వానినిప్పుడే నలువురుదొంగలు బంధించి కొంపోవుచున్నారు. పాపమాతని నెవరైనఁ గాపాడిన బాగుగనుండును. సెలవైన బోయివత్తుము.

చెలి:—అమ్మా! మనముపోవుదమా! పురుషవేషముల నుంటిమిగదా! పౌరుషము చూపవలదా?

వీర:—అవశ్యము పోయెదము. వానిని విడిపింపలేకపోయిన మనశస్త్రమెందులకు? పద. (నిష్క్రమింతురు.)

# తృతీయరంగము.

విరజమహారాజాంతఃపురము—వీరమతి జగదేవులు ప్రవేశింతురు.

జగ:—నాబహిఃప్రాణమా! నీవును నీచెలియు నాయుధపాణులరై యాసమయమున రాకుండు రేని నేనీపాటి కేమై యుందునో? భగవంతుఁడు మిమ్ముఁ బ్రేరేపించి పంపఁబట్టి మరల బ్రతుకఁగల్గితిని. పరమేశ్వరుఁడు నన్ను శోధించుచున్నాఁడుగాని హింసింపఁజూచుట లేదు. నీవంటి సుశీల నాకిల్లాలైయుండుట నాభాగ్యమే కదా?

ఉ. పూరుషుఁడెంతొ పుణ్యము నొనరింపక యున్న చో సదాచారము, సాధువర్తనము, చక్కఁదనమ్ము, పరాక్రమంబునుం జేరిమినొందు సత్సతిని; విశ్రుతశీల! భవాదృశీ, కులాధారను భార్యగాఁబడసి ధన్యతఁగాంచునె జన్మమిద్ధరన్.

వీర:—నాథా! మీరిట్లు కొనియాడుటకు నేనుజేసిన ఘనకార్యమేమి? నాధర్మమే నేనొనరించితినిగదా?

దానికేమిగాని మీరు మాకుఁ దెలియఁజేయక యొంటరిగ వచ్చుటకు గతంబేమి?

జగ:—నీవు పుట్టినింటికిఁ బోయినది మొదలు మా సవతితల్లి నన్ను పఱచినపాట్లు చెప్పఁదరముగాదు. వానిని సహింపలేక పట్టణా సంప్రాప్తమునకుఁ బోయి కొంతకాలము చటనుండ నిశ్చయించుకొని, నీసెలవుగైకొనిమరిపోదమని యిటువచ్చి

తిని. ఎట్టికష్టములు వచ్చినను నిన్ను, నీసోదరుని జూచు భాగ్యముంగంటిని. ఇఁకవద్రరాజ్యమునకుఁ బోయి యేదో యుద్యోగమునుసంపాదించుకొందును. నాకనుజ్ఞయిమ్ము.

వీర:—ప్రాణనాథా! ఇట్లనుట న్యాయమా? నను వీడి పోవుట తగవా? నేను సహధర్మచారిణినిగదా! మఱియు నన్నుఁ గొంపోవుటవలన లాభముంగలదు. అబలనని యనుమానింపకుఁడు.

తే. గీ. అబలనని యెంచి నన్వీడి • యరుగవలదు
సబలలాదురొక్కొకవేళ • నబలలిలను
సత్యభామ భర్తకు విప • త్సమయమందు
సాయమై శత్రుకోటులఁ • జంపలేదె?

కావున మీ వెంట నరుగుటకు నాకనుజ్ఞనొసంగుఁడు.

జగ:—అటులే యరిగెదము. రమ్ము నినుఁ గూడియుండ నాకే యాపదలును బొరయవు. నీవు శుభాంగివి. ఇఁక నాకు శుభములకేమికొఱఁత? (నిష్క్రమింతురు.)

---

## చతుర్థరంగము.

పట్టణపురప్రాంత ప్రదేశము.

(వీరమతి జగదేవులు, ధీరసింహుఁడనువానితోఁ బ్రవేశింతురు)

జగ:—ధీరసింహా! నీవు సార్థకనామధేయుఁడవు. నీసాహాయ్యమునకుఁ గడు మెచ్చితిని. భగవంతుని యనుగ్రహమే

యుండి మరల స్వదేశమునకు రాఁగలుగుదునేని నీకుఁ దగురీతి సత్కారమొనరించెదను. నాక్షేమ మరయుటకై నిన్నుఁబంపి నాకు దారిలో భోజనాది వసతులేర్పఱచిన మాజననికి నాకృతజ్ఞతా వందనములని మనవిచేయుము. వీలైనంత త్వరగా మరలివచ్చి యామె యలుకటఁ దీర్చెదనని చెప్పుము. నీవిఁకఁబొమ్ము. అదే పట్టణపురమును సమీపించుచున్నాము. ఇఁక మాకేరి వలనను భయముండదు.

ధీర:—రాజకుమారా! మీతల్లి సోళంకిరాణి మీతో నిట్లు చెప్పుమన్నది.

"మ. భరియింపందగు భర్త వీడినను నా • భాగ్యంబుఁ గోల్పోయినన్
జిరకాలంబు చెఱం గృసించినను నే • జింతాకులస్వాంతనై
తిరుగంజుమ్మి, కుమార! నీదుముఖ స • త్తేజంబు వీక్షింప దు
ర్భరదుఃఖాంబుదముల్ నశించు, మఱి శో • భావంతమా మన్కియే.

అటుగాన నన్నుమాని నీవెందేనిఁబోకుము. మనమిరువుర మేకానని కడనో పడియుండి కాలక్షేపము చేయుదము. ధర్మజీవనమునకు రాజ్యము లేకావలెనా!" అని. కావున మాఱుమాటాడక రమ్ము మీయమ్మకడకు.

వీర:—ప్రాణేశ్వరా! మీతల్లిగారట్లు దుఃఖించుచుండ మీరిట్లువిదేశములందుంట భావ్యము కాదు. వెనుకకుబోదము

రండు. కష్టమో సుఖమో యామెయొద్దనే యుండి పొందెదము.

జగ:—వీరమతీ ధీరసింహులారా! వినుఁడు.

తే. గీ. ప్రాణమును గోలుపడినైన ♦ మానమునిలు
పుకొనఁజూచు సుక్షత్రియ ♦ పుంగవుండు
సవతితల్లిఁగూడి నన్ను నా ♦ జనకుఁడనిన
నిందలకునోర్చి యింకఁట ♦ నిలువఁదగునె ?

అదిగాక నేనింటినుండి బయలుదేఱినపుడు నాబాహా బలముచేఁ గీర్తిసంపాదించి కాని మిమ్ముదర్శింప' నని మాతండ్రి తోఁ బ్రతినపల్కి వచ్చితిని. కావున వెనుకకు మరలఁజాలను. మాయమ్మ నోదార్పుము. కొంచెముకాల మోపికపట్టుమను ము. మహాశౌర్యవతియు సుగుణవతియు నగు వీరమతితోడనుండ నాకేయపాయమును గల్గదనుము. పొమ్ము.

ధీర:—చిత్తము. అటులైన నాకు సెలవిండు. మీకు సర్వశుభ ములు గలుగుఁగాత.

(నిష్క్రమించును.)

వీర:—మనోహరా! మీరావ్యాఘ్రమును జంపునపుడు చెట్టు మీఁదనుండి కత్తిని విసరినవాఁడు వాఘేలిరాణి మిమ్ముని వలెఁ గన్పట్టెను. వాఁడు కానియెడలఁ బూర్ణముగా వేషముల మార్చుకొనిన మనల నెవరులెట్లు గుర్తింప గలరు? ఆపులినోటఁబడకుండ మనము తప్పించిన బ్రాహ్మ

ణుఁడు ,హాంతకులెవ్వరో యెవ్వరినో చంపుట కీప్రాంత మునఁ గాచికొనియుండి' రని చెప్పుకుండిన మన మేమ రియేయుందుము.

జగ:—అవును. వాఁడు వాఘేలిరాణి తమ్ముఁడే. ఇదే వాని పేరికత్తి మీఁదఁ జెక్కఁబడియే యున్నది. వాఁడు నీవంటి పవిత్రురాలిచేతిలోఁ జచ్చుటచే ధన్యుఁడు. నీదయచే నాకు రెండుగండములు గడచినవి. అదే! పట్టణపురము. నీవాచెఱువుగట్టునఁ జెట్టునీడఁ గూర్చుండుము. నేను బురిలోనికేఁగి తగిన బసకుదుర్చుకొని వచ్చెదను. (వీర మతి యట్లు కూర్చుండును. జగదేవుఁడు పురములోనికిఁ బోవును.)

వీర:—(చేతులు జోడించి యూర్ధ్వముఖియై)

తే. గీ. జనని! నిఖిలశుభప్రదా • యని భవన్మ
హాకృపావిశేషమున గ • హనపుసీమ
యెట్టులోదాఁటి సుఖముగఁ • బట్టణంబుఁ
జేరితిమి, నీదెసుమ్మి మా • భారమింక.

తే. గీ. తల్లి! భక్తులకిలఁగల్ప • వల్లివీవు;
నిన్ను నమ్మిన వారికేఁ • బున్నె మొదవి,
జగతిపైఁ గష్టజాలము • విగతమగు న
టంచువిందుము; కావుమో • యమ్మ మమ్ము.

## పంచమరంగము.



(ప్రవేశము:- మేనాయొక్క రాజ్ఞీ వేషముతో వచ్చిన జామోతియను వేశ్య)

జామో:—(తనలో) ఒక మోహనాంగి యిచ్చటనున్నదని నాదాసి నరహరిచే విని యిచ్చటికి వచ్చితినిగదా! ఏది యామె? ఇందెందో యుండవలెగదా! అదె యాచెట్టు నీడ నొక జవ్వని యొంటిగాఁ గూర్చుండి యున్నది. ఆమేయే కాఁబోలు వీరమతి.

చ. దినమున కొక్కరూపవతిఁ ◆ దెచ్చి యమర్చెదనంచు లాలుదా
సునికడఁ బల్కి నమ్మకముఁ ◆ జూపి వశీకరుఁ జేసికొంటి; మేల్
ధనముల సంగ్రహించికడు ◆ ధన్యతఁగాంచితి; సాటివేశ్యలం
దనితరసాధ్యగౌరవము ◆ నందితిఁ బుణ్యముఁ జేసికొంటచే.

(వీరమతికిఁ గొంచెము సమీపమునకుఁ జని) ఆహా! ఏమి యీసుందరాంగి సౌందర్యాతిశయము!

ఆ. వె. పువ్వుఁబోఁడి రూపు ◆ పురుషులనే కాక
యాఁడువాండ్రనైన ◆ నరతిముంచు
దీనిఁ గూర్చి తేని ◆ దివ్యభూషల నిచ్చి
లీలఁ బ్రోవకున్నె ◆ లాలుదాసు?

దీనిని సమీపించి నావచశ్చమత్కృతిని వినియోగించి నా గృహమునకుఁ గొనిపోయెదఁగాక. (ప్రకాశముగా) ఏమమ్మా! వీరమతీ! మీరారు పరులవలెఁ బెఱచోట బసచేయఁజూతురేమి?

మీకు దగ్గఱచుట్టములమైన మేమీయూరనుండుట యెఱుంగరా? నీ భర్త నాకొక వేలువిడిచిన మేనల్లుఁడుసుమా. రాజుగారు వాహ్యాళికై పోయివచ్చుచు మార్గమున నీ మగనిఁగని యాన వాలు పట్టి, పిలిపించి, కోటలోనికిఁ దీసికొనివచ్చిరి. నిన్నుఁగొని తెచ్చుటకు దాసీజనమును బంపుట తగదని యెంచి నన్నే వెళ్లుమనిరి.

ఉ. కాయలుగాచె నాకనులు ♦ కాంచఁగ గల్గితి నిన్నినాళ్లకున్
బాయని వేడ్కనాయనుఁగు♦బావ ని,ముద్దుల మేనయల్లునిన్
నా యెద సంతసంబుఁగనె♦ నాజగదేవుని, నిన్నుఁ,జూడఁ;గొం
పోయెదరమ్ము కోటకు, వి ♦ భుండఁట నల్లునితోడ వేచెడున్.

వీర:—అమ్మా! మీరు మాకు బంధువులా? మీరిచ్చటనుం డుటయే నేనెఱుఁగను. ఏమి నాభాగ్యము! భగవం తుఁడు జగద్బాంధవుఁడై నిమ్మనువ మాకంతయు శుభమేకదా?

జామా:—తల్లీ! నీ వంటి శుభాంగికి శుభము కాక మఱేమ గును? రా. ఆలస్యము చేయకు. జగదేవుఁడును మహా రాజుగారును మనకొఱ కెదురు చూచుచుందురు.

వీర:—అమ్మా! అవశ్యము వచ్చెదను. (అని లేచి జామాతిచే మేనాలోఁ గూర్చుండఁ బెట్టఁబడి కొనిపోఁబడెను.)

---

## షష్టమ రంగము.

జామోతిగృహములోని గది.

జామో:—అమ్మా! వీరమతీ! మధ్యాహ్నభోజనము నీకంత సదుపాయముగా లేదు. ఇప్పుడైనఁ గడుపునిండఁ దిందువుగాని లెమ్మా.

వీర:—అమ్మా! నానాథుఁ డికనో యిప్పుడో వచ్చునని యింతసేపును వేచియుంటిని. మఱియు నాతఁడు రాజుగారితోఁ గలిసి భుజించెనని మీరు చెప్పియుంటచే నోర్పువహించితి. నాభర్త యూరనున్నపుడాతనినిఁ జూడకుండ నింతసేపెన్నఁడైన నుంటినా? ఇది యేదో మోసమువలెఁ గాన్పించు చున్నది. నిమిత్తములు మంచివిగాఁ గాన్పింపవు.

జామో:—అయ్యోతల్లీ! నీవు వట్టి బేలవుసుమా. నీనాథుఁ డెక్కడకుఁ బోవునమ్మా! రాజుగారితో షికారు వెళ్లెనేమో! లేక యొకవేళ రాజుగారాతని నీపూఁట కూడ నాఁపికేమో! నీవు భుజింపుము.

వీర:—నీవు పదేపదే చెప్ప నవసరము లేదు. నేనునాప్రాణకాంతునిఁ జూచువఱకు భుజింపను.

జామో:—అట్లయినచో నీయిష్టము. అవె పరిపక్వఫలములు. వానినైన భక్షింపుము. ఆ చెంతనున్న వే యతిరుచ్యము

లగు రసాయనములు. వానినిద్రాపుము. నాకుఁ బనియు న్నది—నేఁబోయెద—

(తనలో) తే-గీ. నేనె వేశ్యననంగఁజాలు ♦ దానిఁ గాని
యితరకాంతలెల్లరు వెల ♦ యింతులౌదు
రెటులు ? జగదేక సుందరిం ♦ జిటికలోన
వంటయింటి కుందేలుగాఁ గొంటిఁగాదె.

లాలుదాసు వచ్చువేళ యగుచున్నది. పోయెదను. (అని గదికిఁ బైని బీగమువైచి యావలకుఁ బోవును.)

వీర:—(తలుపుచప్పుడువిని) ఆహా ! దైవమా ! నాకెట్టియిక్కట్టులు తెచ్చిపెట్టుచుంటివి ? పెనములోనుండి వేపఁబడుచుండుచేప బాధానివారణార్థము దుమికి ప్రొయ్యిలోఁ బడినట్లు నాబ్రతుకయ్యెనుగదా ?

తే-గీ. అక్కటా ? యిట్టి మాయలోఁ ♦ జిక్కుకొంటి;
నన్ను జామోతిమోస మొ ♦ నరిచెఁ గాదె ?
మారిణివలె దాని వలజిక్కి ♦ యగడు వడితి;
కరుణ నీచిక్కు విడిపించి ♦ కాతురెవరు ?

అప్పుడే జాముర్రాత్రి కావచ్చినది. నాథుఁ డింకను రాఁడయ్యె. ఏమి చేయుదు ? (కొంచెముసే పాలోచించి) నేను క్షత్రియకాంతను గదా ? వెరవనేల ? ప్రాణము పోయినను మానహానీ కానియ్యను. నాయొడ్డాణమందమడఁచియున్న కత్తియే

నన్నుఁ గావఁగలదు. కానిమ్ము. చూచెదఁ గాక! (ఉలికిపడి) తలుపుచప్పుడు వినఁబడినది. నామనఃకాంతుఁడేమో! (అని ద్వారముకడ కేఁగును).

(ప్రవేశము-సింగారించుకొని హొయలుతో నడుచుచువచ్చు లాలుదాసు)

లాలు:—(తనలో) ఈమెయే కాఁబోలు జామోతి నాకొఱకుఁ దెచ్చిన యన్నుల మిన్న. ఏమి యీమె విన్నాణము!

తే-గీ. కలికిరూపుఁ జూడఁ గనుల ♦ కఱవుదీఱు;
భామరావము వినఁ గర్ణ • పర్వమౌను;
ముగుద దేహసురభి ఘ్రాణ ♦ మునలరించు;
నిట్టి మోహనాంగి లభింప ♦ నెంత సుఖమొ.

(ప్రకాశముగా) సుందరీ! నీయట్టి యందకత్తె దొరకుటచే నేనును, నాయట్టి ధనవంతుడు దొరకుటచే నీవును, నదృష్టవంతులముగదా! నేను గోత్వాలు కొడుకను. నాకడ నపార ధనసంచయములు గలవు. నాయాజ్ఞ రాజాజ్ఞనుమించి లోకులు గౌరవింతురు. నన్నుఁ జేబట్టి సుఖింపుము.

వీర:—దుష్టా! నీవెవడవైన నాకేమి? నన్నీరీతి మాయఁజేసి తెచ్చిన యీ మాయలాడిని నిన్నుంగూడ దుదముట్టింతును. నేను రసపుత్రకాంతను. పతివ్రతను. ఇట్టినన్ను జెఱుపఁ దలఁచుట నీచావునీవే తెచ్చుకొనుట.

* ఈ గీతమందలి ప్రతి పాదము నుత్సాహావృత్త లక్షణమునకు సరిపోయి యుండును.

ఇప్పుడైన బుద్ధిగలిగి నాభర్తతో నన్నుఁగూర్పుము. బ్రతుకుగనుము.

లాలు:—నీభర్తను నేనే. నన్నే నేనునీకుఁ గూర్పవలయు (అని సురాపాన మత్తతచే నామెపైఁ బడఁబోవును. వీరమతి యొడ్డాణముఁ దమర్పఁబడిన కత్తినిబెఱికి)

వీర:—ఓరి నీకుఁజేటుకాల మాసన్నమైనది. కాచికొనుము. (అని కొబ్బరిపుచ్చినవలెఁ దలనఱకును. లాలుదాసు రొఁజుచు నేలఁగూలును. గవాక్షమునుండి వానిశవమును వీరమతి వీధిలోనికి విసరివైచి లోన గొండెముఁ బెట్టుకొనును. వీధిలోను గృహమందును గలకలమువినిపించును)

వీర:— తే. గీ. దేవ! గృహకలంబమునుండి ♦ తెఱపిఁజేసి
దొంగలవలనిభయమును ♦ దొలఁగఁజేసి
కాచిన కరుణామూర్తి వి ♦ కలుషుఁడొకఁడు
మానహానిని బూనఁగా ♦ మలపరావె?

అదె వీధివైపుననున్న కిటికీగుండ లోనికిరా నెవ్వఁడో యాయువుమూడినవాఁడు యత్నించుచున్నాఁడు. రానిమ్ము. వాఁడును యజమానునిచెంతకే పోవును. (అని వానితల యగు పడిన వెంటనే నఱికివైచును. అటులే పదునొకండుమందిభటులఁ జంపును.)

తే. గీ. నాథుఁజూచుదాఁక ♦ నాప్రాణిక్క విడకుందు;
.గదినిఁ జొచ్చువారిఁ జదిపివైతు;

ఉదయమందునైన ♦ హ్రాదయేశుఁగనకున్న
బలిమిమై నశువులఁ ♦ బాయుదాన.

(ప్రవేశము-రాజు.)

(తనలో) జనులవాంఛితములఁ దీర్చుచు సాధ్యమయి నంతవఱకు ధర్మముగాఁ బాలించుచున్న నారాష్ట్రమునందే యిట్టి యల్లరులు గలుగుచున్నవేమి? నేనజాగ్రత్తతోనుంటినా? లేక క్రిందియుద్యోగులు నాకడ యథాస్థితిని మఱుఁగుపఱిచిరా? ఒక్కస్త్రీయేమి! దండనాయకునిఁ గొడుకును జంపుటేమి! అంతటితోఁ దృప్తినొందక పన్నిద్దఱుభటులఁగూడఁ గడతేర్చినదఁట! ఎట్టి రాక్షసకృత్యమొనరించినది? (యోజించి) కాని సామాన్యయువతిక యింత సాహసకార్య మాచరించునా? ఇందేదో రహస్యముండవలెను. పోయి నయమున నామెనే యడిగిచూచెదను. (గదితెలుపు దగ్గఱకుఁబోయి బిగ్గఱగా అమ్మా!

ఉ. పట్టణరాజ్యమేలు నర ♦ పాలుఁడనేను, సుధర్మనాముడన్
బుట్టితి ధర్మమెల్లెడలఁ ♦ బూర్ణముగా నెలకొల్ప; మానినీ
యిట్టి మదీయరాష్ట్రమున ♦ నేమిప్రమాదము సంభవించె,నీ
విట్టిపనుల్ వొనర్చితివ ♦ దేల యెఱుంగఁగఁ జెల్పుఁ దీర్చెదన్.

వీర:—అయ్యా! నీవు నిక్కముగా నీదేశాధీశ్వరుఁడవైనఁ జెప్పెదవినుము. నే నుదయాదిత్య మహారాజు కోడలిని. బిరజమహారాజు చెల్లెలిని. కారణాంతరమున నేనును

నాభర్తయు నీసేవఁజేయునుద్దేశమున నిన్న నీపురికి వచ్చితిమి. నానాథుఁడు నన్నూరిబయటఁ జెరువుగట్టున నుంచి బసఁజూచి వచ్చుటకై యూరిలోనికిఁ బోయెను. అప్పుడు నీళ్లకు వచ్చిన వనితయొకర్తు నాచరిత్ర మరసి తన యజమానురాలినిఁ బంపినది. ఆమె రాణివలె నలంకరించుకొనివచ్చి నాకుఁదాను దగ్గర చుట్టమని నమ్మించి మోసపుచ్చి యీ మందిరమునకుఁ దెచ్చినది. ఆమె జామోతియనఁబడు వేశ్యకాంత యని యావల దెలిసికొంటిని. ఎవఁడో కొత్వాలుకొమరుఁడట. లాలుదాసువాని పేరఁట. ఆ దుష్టుఁడు నామానభంగమును జేయవచ్చెను. నేను నయమున భయమున వానికి బుద్ధిఁజెప్పి తుదకుఁ జేయునది లేక వానిని మదముట్టించితి. వాని యనుచరుల నటులనేచేసితి. నాభర్తవచ్చువఱకుఁ గత్తినొరలో బెట్టను. తలుపుతీయను. నీవు ధర్మపరిపాలకుఁడవేని నా మగని నా కప్పగింపుము.

రాజు:—అమ్మా నీచరిత్ర పరమపవిత్రమయినది. నీ భర్తను వెదకించి పంపెదను. ఓరీ భటులారా! ఆకులటాంగన యగు జామోతినిఁ గట్టి కారాగృహంబున నుంపుఁడు.

---

## సప్తమరంగము.

రంగము:—రాజాంతఃపురము.

జగ:—సతీ! నీ యద్భుత చారిత్రమును రాజుగారినోటవిని యానందించితి. నీకతమున జామోతియొక్కయు లాలుదాసుయొక్కయుఁ గుట్రచేత సంభవించిన చెఱ నాకుఁ దప్పినది. రాజానుగ్రహము గలిగినది. దండనాథపదవి చేకూఱినది. గౌరవముతో జీవించు నాధారము గల్గినది.

ఆ. వె. పరమసాధ్వియైన ♦ భార్యఁగూడినవాని
కెంతలాపదలును ♦ నెఱుకపడవు;
మంచుపిరియునట్లు ♦ మించియేచెడుబాధ
లెల్లఁ జెదరిపోయి ♦ యెలమిఁగూర్చు.

వీర:—నాథా! నాకతమున నందు రేమి? భగవంతుని కృప వలన ననుఁడు. సర్వసాక్షి, దయామయుఁడు, శుభంకరుడు—అతడే మనకీ కష్టములఁ బాపి సుఖముల నొడఁగూర్చెను. మనపై నవ్యాజప్రేమఁ జూపిన యప్పరాత్పరుని స్తుతింతము రండు.

జగ, వీర:—(ముకుళితకరులై)

దండకము:—దేవాదిదేవా! యనంతప్రభావా! దయాపూర్ణభావా! మహాపాప సంకీర్ణమైయుండె మాజీవచారిత్ర మీ

లోకమందెప్పు సత్కార్యమొండైనఁ జేయంగ లేకుంటి, మత్స్యం తదాప్త్యంబు సల్పంగ సంసిద్ధమైయుందు మెల్లప్పు; దక్షైన దాక్షిణ్యరూపుండవౌ నీవు మమ్మెల్లడన్ సాదరాయత్త చిత్తుం డవై ప్రోచుచున్నావు, తత్ జ్ఞానమేమాత్రమున్నాకు లేదాయె, దుర్బుద్ధితో మేము నీనుండి దూరాన సంచారముం జేయుచు న్నాము, నీనిర్మితంబైన ధర్మంబులన్నల్పు లేకుంటి; మున్నుండిన న్నాకు సౌఖ్యాళిఁ జేకూర్చి యేవంతయైనం బ్రమాదంబు రాకుండఁ గాపాడుచుంటే! మహాప్రేమమూర్తీ! నమస్కారముల్ భక్తిమై చేయుచున్నాము. నీదత్తమైనట్టి యీదండనాథత్వముం శుద్ధభావంబుతో జేయు నుత్సాహముం గూర్చి దేశోపకారంబు తాకృత్యముల్ సల్ప దానన్ భవత్సేవఁ జేయంగ శక్తుల్ గటా క్షించి మమ్మెప్డు రక్షించుమా! లోకమందెల్ల దౌర్జన్యమున్మాని శాంతిం బ్రతిష్ఠించి కాపాడుమయ్యా! త్వదీయేచ్ఛయే సర్వదా చెల్లుఁగాతన్, భవద్రాజ్యమేసుస్థిరంబై ప్రవర్తిల్లుతన్.

జగ:—ప్రియా! నాకు సెలవిమ్ము. నేను న్యాయసభకుఁ బోయి రాజకార్యములు నిర్వర్తింపవలయును. మఱియు మన క్షేమసమాచారములు ధీరసింహునికిని మాయమ్మగారికిని వేగులవాండ్రచే నెఱిఁగింపవలయును. (నిష్క్రమింతురు)

---

## అష్టమరంగము.

ప్రవేశము:—కఠోరకుఁడు, భీషణుఁడు—అను నిద్దఱుపౌరులు.

స్థలము:—పట్టణపురములోని యొకమైదానము.

కఠో:—ఈజగదేవుఁడు ముండకొడుకు ముందర మనయాటలే వియుసాగుటలేదు. మనవెఱ్ఱిరాజు వానిపలుకులెల్ల వేదవాక్యములుగానెంచి మనబోంట్లను కఠినముగా శిక్షించుచున్నాఁడు. ఇఁక మన కేదిదారి ? ఏమియుదోఁచకపోవుటచే నిన్నింత యర్ధరాత్రమున లేవఁదీసి యిక్కడికిఁగొనివచ్చితి.

భీష:—మనజట్టువాండ్రిందఱుఁగూడి యెన్నియో దొంగతనములు, దోపిడులు, హత్యలు చేయించుచున్నారుగదా? వాని నణఁచుటకు రాజునకుఁగాదు వానియబ్బకైనఁ దరముకాదు. కొన్నాళ్ళకైన దీనికంతకును జగదేవుఁడే కారణభూతుఁడని యతఁడెఱుఁగకపోఁడు. తొందరపడకు మనము పడినన్నాళ్లు కష్టములుపడము.

కఠో:—ఓరి తెలివితక్కువవాఁడా ! ఇంకను బెడత్రోవనే యున్నావా ! మనవాండ్రల్లరులు చేసినకొలఁది రాజు జగదేవుని యుపదేశముపై మఱింత కఠినదండనలు విధించుచున్నాఁడు. జగదేవుఁడు తనశక్తిఁ దానే యుప్పొంగి పోవుచున్నాఁడు. ఈనడుమ నాతనికొక పుత్త్రుఁడుపుట్టి

టయు, నాసమయమున రాజుగారు తమకు మనుమఁడు పుట్టినట్టులేయెంచి గొప్ప యుత్సవముం జేయించి యాకుటుంబమువారిని గౌరవించుటయు, నీవు వినియేయున్నావుగదా ? అట్లు జగదేవుని వలనఁ జిక్కియున్న రాజెన్నఁటికేని మరలునని యాసపడకు. అదికలలోనిమాట.

భీమ:—అట్లైన మనము చేయునదేమి? నీవే సదుపాయమును యోజింపుము.

కరో:—నాకొక యుక్తిస్ఫురించినది. అదేదన:—మన స్నేహితులు చేయుచున్న దారుణకృత్యములఁజూచి రేఁడు భయపడి కాళికాదేవాలయమున సమారాధనలు చేయుటకై నేఁడు స్వయముగా వచ్చుచున్నాఁడు. అతనికి దేవియనిన భక్తిమెండు. నీవా దేవి విగ్రహమునకు వెనుకదాగియుండి యతఁడు ప్రార్థనము చేయునపుడు గంభీరముగా నిట్లుపలుకుము. “ఓరాజా! నీవొక సమస్తసద్గుణపరిపూర్ణుఁడగు రాజకుమారుని నాకు బలిగా సమర్పింతువేని నీరాజ్యమందలి కలఁతలు రూపుమాయును.” అటుపిమ్మట నాఁడేమైన మార్వలికిన సందర్భాను సారముగా మన యుద్దేశములకు భంగముగాకుండఁ బ్రత్యుత్తరమునిమ్ము. అట్టి రాజకుమారుఁ డెవ్వఁడనియడిగిన జగదేవునిఁ జేర్కొనుము. నృపుఁ డదివిని జగదేవుని బలియిచ్చును. మనపుణ్యము పండును. ఇదియే తగిన

యుపాయమని నాకుఁదోచినది. నీయభిప్రాయమేమి ?
అట్టులొనరించుటకు నీకు సమ్మతమా ?

భీమ:—పరమసమ్మతము. నీ యోజన మిక్కిలిచక్కఁగానున్నది. ఇది దేవకార్యముగా భావించి నీయుపదేశము ననుసరించెదను. పోదమురమ్ము. తెల్లవాఱుచున్నది. సూర్యోదయమైన రాజు రాఁగలఁడు. ఈలోపుననే నేనక్కడ డాఁగవలయు. (నిష్క్రమింతురు)

---

## నవమరంగము.

రంగము:—జగదేవుని మందిరము.

ప్రవేశము:—చిన్నిపాపని లాలించుచు నుయ్యాలనూఁచుచు లాలిపాటపాడుచున్న వీరమతి.

మధురగతి రగడ.

వీర:—లాలిజగద్దవ - లా। మతివిమలా
జోలలఁబాడెద - లీలఁబరుండుము.
కులయశము నిలుపఁ - గలవాఁడవగుచు
వలసిన శుభగుణ - ములఁ బడయుమోప్రియ
జననీజనకుల - ఘనకష్టంబులఁ
గనకీవనయము - మనుతసుఖంబున
పుడమిని బాలిం - చెడు ఘనభాగ్యం
బిడి నినుఁబ్రోచుత - మీశ్వరుఁడెలమిఁ.

(తనలో) ఏమిది! మధ్యాహ్నము మీఱియుండెను. నా నాథుఁ డింకను రాఁడయ్యె. ఆయనకే దేనివిపత్తు ఘటిల్ల లేదుగదా? ఎట్టిపని తొందరలున్నను భోజనమున కింతయాలశ్యము చేయు చున్నఁడునులేదు. ఏమి సంభవించినను బెక్కుసారులు మాకుఁ దోడ్పడి రక్షించిన పరమేష్ఠి యిప్పుడు కావఁడా? తప్పక కాచు ననియే నాదృఢవిశ్వాసము. నా విశ్వాసము రిత్తవోదు.

చ. పరమపితా! విపత్తులను ♦ వారిధిలోఁబడి మేరఁగాన కే
మరయుచు దుష్టమానవచ ♦ యంబనునక్రని కాయఘాటికిఁ
దరితులమాచునుండ మముఁ ♦ దార్కొని కావవె నావనీవయై
వరకృపనట్టులే యిపు డ ♦ పాయనిరోధముఁ జేసిప్రోవుమా!

(ప్రవేశము—జగదేవుఁడు.)

(వీరమతి భర్తనెదుర్కొని సాదరమున స్వాగతమిచ్చి) నాథా! నేఁడు మీరేల యింత యాలసించితిరి? (మొగము వంకఁ దేరిచూచి యాశ్చర్యముతో) ఇదేమి? మీ ముఖపద్మ మిట్లు వికాసవిహీనమై యున్న దేల? నా డెమ్మది తల్లడపడు చున్నది. ఖేదకారణముం దెల్పి నాయులమటఁ దీర్పుఁడు.

జగ:—ప్రియా! జనియించినదాది నాకును, బెండ్లియాడుట మొదలు నీకును గష్టపరంపరలు గల్గినవి. దైవకటాక్ష ము చే, నీపాతివ్రత్యమహిమచే, వారినెల్లఁ గడచి యీాపు రని సుఖింపఁగల్గితిమి. కాని ధర్మపరాయణుల కెందును దుష్టులు సహజశత్రువులై యెగ్గుసేయఁ గోయుదురు.

వీర:—ఇప్పుడు దుర్మార్గులెవరేని తేనితో మీ
చెప్పి యుప్పుడె దెచ్చిరా ?

జగ:—రాజట్లు సూచకజనుల నుడులవినువాఁడ
ధర్మసంస్థాపనార్థమై దుష్టశిక్షణమునకు
టరులు తెగి హత్యలు కావించుచున్నార
నదియేకద ! తన్నివారణము చేయుమ
కాళికాదేవిని బ్రార్థించెనఁట. దేవిప్రత
బలియిచ్చిన శాంతిగల్గునని వచించెనఁట
దై నగరుఁజేరి యేమిచేయుటకుం దో
డఁట. అదివిని నేను దేశముకొఱకు
బ్రాణము లర్పింపనిశ్చయించు కొంటిని.

తే. గీ. దేవికుపహారముగ నాదు • దేహ
దేవతాత్మప్రీఁగూర్చి •, దేశరక్ష
ణంబొనర్చియు, నృపుని బు • ణం
కొనియు ధన్యుండనగుదుఁ; దై •

వీర:—ప్రాణకాంతా ! మీ నిశ్చయబుద్ధి
నన్ను విడిచి మీరు చనిన మీ బహి
చినవారలగుదురు. అదిగాక మీరు చ
మున నేను గూడ మీ మార్గ మన
కాన నాయనుగమనమున కనుమతిం
కూన నేమిచేయువారము ? (కన్నీరు

ఆ-వె. పరమయోగి పోల్కి • దరహాసమొనరించు
నంతెగాని యితర • మింతఁగనఁడు
అట్టి బాలు వీఁడి • యెట్టులరుగుదాన !
నెవరి కప్పగింతు ? నేది త్రోవ ?

జగ:—మనోనాయికా ! నీవు వగవ వలదు. మనము ముఖ్వారము దేవికి దేహము లర్పింతము. బాల్యమందే తనరక్తమును రాజు కోట కర్పింపనుంటచే మన పుత్త్రుఁడు జగద్ధవలుఁడు ధన్యతముఁడు. ఇఁక మనకున్న వస్తుసంచయము లర్థులకు దానమొసఁగి, యుచితవస్త్రధారణముం జేసి దేవాలయమునకుఁ బోదము రమ్ము. వేగము లెమ్ము. (నిష్క్రమింతురు.)

---

## దశమహాంగము.

స్థలము—కాళికాలయము.

(ప్రవేశము:—వీరమతి, జగద్ధవల, జగదేవులు.)

జగ:—(ప్రియా ! మొదట బాలకుఁడును, నవలనీవును, గడపట నేనును దేవికి గానుకలుగా నర్పింపఁబడవలసియున్నది.

వీర:—(కన్నీటితో) నాథా ! నాచిన్నిసుతురక్తము నాకన్నుల యెదుటఁ గాఱుచుండ నేను సహింపఁజాల. ముందు నన్నర్పించి తరువాత—[డగ్గుత్తికరాఁగఁ జెప్పలేక వాపోవును.)

జగ:—(ధైర్యముతో) మనోహారిణీ! ఇట్టి పవిత్రసమయమున భామరులవలె నీవు వగవవచ్చునా? మన యుద్యమమున కేభంగమును గలుగకుండ శీఘ్రముగా సిద్ధపడుము. నీ కోరిక చెప్పిన ముందు నిన్నే యర్పింతును. మనము కడపటి ప్రార్థనము సలుపుదము రమ్ము.

జగ, వీర:—(చేతులు జోడించి నిమీలిత నేత్రులై)

పంచ. పరాత్పరా! త్వదీయసేవ - భక్తిమీఱఁ జేయుచున్
జిరంబు జీవముద్ధరించి - చేరుచుంటిమయ్య నిన్
ధరన్ స్వధర్మమాచరింపఁ - దాపముల్ ఘటించినన్
గరంబు నీదు ప్రేమకల్మిఁ - గ్రాలినాము ధన్యతన్

పంచ. క్షమింపుమయ్యమా కలంక - జాలమెల్లఁ బ్రీతితో
సమస్తప్రాణికోటిఁ గాచి - శాంతినిల్పుమెల్లెడన్
ప్రమోదపూర్ణభావయుక్తి - భక్తులైన మేమిదే
సమీపవర్తనంబుఁ గోర - స్వాగతంబొసంగుమా!

జగ:—ప్రియా! ఇఁక జాగుచేయకుము. రమ్ము. (వీరమతి దేవికి నమస్కరించి తద్విగ్రహము వంకనే మొగముంచి మెడ వంచును. జగదేవుఁడు ఖడ్గమును దూసి, జళిపించి, ఇంచుక సేపు ధ్యానించి, 'జయ్ కాళీ' యనుచు నేయఁ బోవును. పట్టణ సంస్థానాధిపతి పరుగున వచ్చి యాతని చేతిని బట్టుకొని యాఁపును.)

సుధర్మ:—జగ దేవా ? ఇట్టి తెగువ తగునా నీకు ? దేవి యడిగినంతమాత్రమున నిన్నుఁ బలిగా నిచ్చెదనంటినా ? లేదే. నీవంటి మహానీయుని నాకంఠమునఁ బ్రాణము లుండఁ బోఁగొట్టుకొందునా ? దయాస్వరూపయగు దేవి యేలయిట్టి విషమవాంఛ నొందెనని యచ్చెరువొందు చుంటిని. సాహసకార్యము మాని నావెంటరమ్ము.

కాళి:— రాజా ! నీక్షేమము నీవెఱుఁగకుంటివి. ఈ యువకుని పై వెఱ్ఱికూర్మిఁజెంది దేశమును బ్రజలను నాశముఁ గావించుకొనుచుంటివి. నీకు మేలు సలుపఁబూనియే నేను హితోపదేశ మొనర్చితిని. నీవు వినకున్న మఱియుఁ జేటువాటిల్లునుజుమీ ! అనల నీచిత్తము.

సుధర్మ:—(వినుట నభినయించి) ఈ పల్కులు దేవియే పల్కెనా ? విగ్రహము యథాపూర్వముగనే యుండెనుగాని కొంచెమైనఁ జలించుట లేదు. పెదవియైనఁ గదలుట లేదయ్యె. ఇదియేదో వింతగాఁ దోఁచెడిని. ఇందేదో మోసముండవలయును. (అనియించుకసేపు యోజించి చటాలున దేవి విగ్రహము వెనుకకుఁబోయి చూడఁ గ్రింద నక్కి యున్న రాజద్రోహి కనుపట్టును.)

సుధ:—(కోపావేశముచే మొగము జేవురింప) ఓరీ! భటులారా! ఈపాపిని బట్టి బంధింపుఁడు. ఆహాహా ! ఎంతమోసము ! ఈషాగాథము లెంతఘోరకార్యము లాచరించుచుండిరి. (పండ్లు పటపటఁ గొఱుకుచు)

శా. ఓపాపాధములార ! యస్మదమితా • త్యుగ్రప్రతాపాగ్నికీ
లాపుంజంబులకు న్నిము న్నలభజా • లపాత్రియులం జేసి సం
తాపంబొందగ జేయువాఁడ ; జనసం • తానంపుసంక్షోభముల్
వే పోఁగొట్టెద ; మీదుశోణితములన్ • పృథ్వీస్థలి జల్లుచున్ •

జగ:—(ఆశ్చర్యఁగని తెల్లఁబోయి) మహారాజా! నేను దేవ్యాదేశమైన దనియే నమ్మి యీసాహస మాచరింపఁబూనితిని. కాని నిజము బయలుపడినది. మీరిప్పుడు క్రోధఘూర్ణమాన మానసులై యలమట పడకుఁడు. పౌరుల దౌష్ట్యము నేన యడఁచువాఁడ. మీసంకల్పము పవిత్రమైన దగుటచే మేమమరల జీవించునుపాయముగల్గెను.

(ప్రవేశమొక యాశ్వికుఁడు•)

ఆశ్వి:—జగదేవ మహారాజుగారెక్కడ? (కలయఁజూచి వచ్చని బట్టలు గట్టుకొన్నవాఁడేయని యానవాలుపట్టి) రాజకుమారా ! మీజనకుఁడు మిమ్ము శీఘ్రము తోడ్కొని రమ్మని యానతిచ్చె. దేశదేశములఁ దిరిగి యిక్కడ మిమ్ముగంటిని. మీసవతి మూలమున మీతండ్రి కెన్నియో యిడుములుగల్గినవి. కాని యవి మీతల్లిచాతుర్యముచే రూపుమాసినవి. రాజిప్పుడు మిమ్ముఁ బట్టాభిషిక్తులఁ గావింప రమ్మనెను. వెనుకటి తప్పులను మన్నింపఁ గోరెను.

సుధ:—నాయనా ! నాకుఁ బురుషసంతానము లేదుగదా ! నా కూఁతు ప్రభావతిని నీకొసంగి ముందుగా నారాజ్యము

నకు నిన్నుఁ బట్టాభిషిక్తునిఁ జేసెద. ఇచ్చటికే మీజననీ జనకులఁ బిలిపింతు. లెమ్ము రమ్ము.

(అందఱు నిష్క్రమింతురు.)

---

## ఏకాదశరంగము.

స్థలము:—ధారానగరములోని రాజభవనము.

ప్రవేశము:—ఉదయాదిత్యుఁడు జగదేవుఁడు, ధీరసింహుఁడు.

సోళంకిరాణి, వీరమతి, ప్రభావతి, కొందఱు సేవకురాండ్రు.

ఉదయా:—కుమారా! దుర్జాతయగు నీసవతితల్లి మాయలలో బడిపోయి యెన్నియిడుములకో పాల్పడితిని. లోకారాధ్య యగు నీజననివలనను, సౌజన్యనిధియగు నీధీరసింహుని మూలమునను నవియెల్లఁ బాసినవి. నేను మీతల్లినెట్లు గారించినను, నామెమాత్రము నన్ను,

చ. చెఱవిడిపించి కాచె; రిపు • సేనల యుద్ధమునందునోర్చి రా
జ్యరమనొసంగెఁ గ్రమ్మరఁ; బిం శాచియనందగు తత్సపత్నిదు
ష్కరణముల న్మది న్మఱచి • సన్మతిఁగైకొనెదాని ; నట్టిభా
సురగుణజాల నీజనని • సుమ్మి విపత్తులఁదోచె నాకిలన్.

నేనెంతపాపినో యంత ధన్యుడనైతిని.

జగ:—జనకా! మీకు వలెనే నాకును బెక్కిడుములు పొడమినవి. మీకు మీప్రియభార్యవలె నాప్రియపత్ని నాకు వానిని బాపినది. సహజ సౌశీల్యమొందు కళత్రములఁ బడయుట కంటెఁ బురుషులకు వేరు భాగ్యము గలదా?

శోశంకి:—నాయనా ! ఇందు నేనుజేసినదిలేదు. నాకుఁ దోడఁ బుట్టినవాని కన్న మిన్నగ నీధీరసింహుఁడు దోడ్పడెఁ. అతఁడే యీశుభములకు గారణభూతుఁడు.

ధీర:—రాకుమారా ! రాజా ! నేను నాధర్మము నెఱపితినిగాని యొండాచరింపలేదు. సంస్తవ పాత్రుఁడను నేనుగాను. పరాత్పరుఁడు స్తుత్యుఁడు. అమ్మా ! ప్రభావతీ ! నీవు నీసవతి వీరమతికై పడిఁ బవిత్రచరిత్రవు కమ్ము. పూజ్యులారా ! ఇఁక జాగేల ? జగదేవునికిఁ బట్టాభిషేక మొనరింతముఁ రండు. ఇంక మన కేమికావలయును? ఇట్లగుగాక.

తే. గీ. న్యాయమున రాజులేలుత ♦ మవని నెప్డు ;
నిలఁ బ్రజాళికి స్వస్తియె ♦ వెలయుఁగాత ;
గో ద్విజ తతికి శుభములు ♦ గూరుఁగాత ;
సర్వలోకముల్ సుఖమున ♦ సాగుగాత.

స మా ప్త ము .

---

# పీఠిక.

ఆంగ్లేయులు హిందూదేశమందు స్థిరరాజ్యమును సంపాదింపఁ బ్రయత్నములు సలుపుచుండఁ, గొంతకాలమువఱకు మన ద్వీపకల్పమునకు నడుమనున్న రాజపుత్రస్థానము మాత్రము స్వాతంత్ర్యము వహించియే యుండెను. ఆంగ్ల నాగరకత యప్పుడించుక మన దేశమునఁ బ్రవేశించినను, రాజపుత్రస్థానమున మాత్రము జొచ్చియుండ లేదు. రసపుత్రులు పూర్వాచారపరాయణులై మెలఁగుచుండిరి. పందొమ్మిదవ శతాబ్దారంభమున నుదయపురమును భీమసింగను రాణా యేలుచుండెను. కాని పూర్వీకుల బలవైభవాదులతనికి లేకుండెను. సామంతరాజులందఱు స్వతంత్రత వహించి పేరునకుమాత్రము లోబడియుండిరి. అతనికిఁ గృష్ణ యను సుందరాంగియగు కూఁతురుగలదు. ఆమెను బెండ్లియాడ జయపుర యోధపుర రాజులు యత్నములు సలిపిరి. వారిలో యోధపురరాజు నీచకులజుఁడు. కాని మిగుల బలవంతుఁడు. వానికోర్కె నిరాకరించుట రాణాకును దక్కినవారికిని క్షేమకరము గాదు. కృష్ణాకుమారి నీచునిఁ బెండ్లియాడి తన దేహము నపవిత్ర పఱుచుకంటె మేనుఁ దొఱఁగుటయే మేలని యెంచి దేశక్షేమమును దనమానమును గాపఁదలఁచి, బలాత్కారమునఁ బ్రాణములు వాసెను. ప్రాణముకంటె మానమెక్కుడని రసపుత్రులు తలఁచువారనుట సార్థకము చేసెను.

# కృష్ణాకుమారి.

ఇందువచ్చుపాత్రలు.

భీమసింగు—ఉదయపుర రాణా.

జయపుర రాజువద్దనుండి వచ్చిన యొకదూత.

సింధియామహారాజు నొద్దనుండి వచ్చిన దూత.

శాంత—భీమసింగుని రాణి.

కృష్ణ—భీమసింగుకొమార్తె.

అజితసింగు—భీమసింగు కుమారుడు.

సత్వంతసింగు—కరదూరు దేశపు సామంత రాజు, ఒక యోధుడు

ఇద్దరు సేవకురాండ్రు.

---

రంగము:—చిత్తూరులోని రాజభవనమందలి రహస్యా

గారము. పీఠముపై రాజు కూరుచుండియుండును.

ఎదుట నిద్దరుదూతలు నిలుతురు.

{ తెరచాటున అజితుడు, రాణి, కృష్ణ తగునాసనముల కూరుచుండి యుందురు. }

భీమసింగు:—కాని నాకు దగ్గరచుట్టము, స్నేహితుడునగుజయ పురమహారాజునకు నేనుజేసిన వాగ్దానమును జెల్లింప వలసిన విధిగలదు.

జయపురదూత:—సత్యము. మహారాజా! తమరన్నమాట నెఱ వేర్పవలయును. కృష్ణాకుమారీదేవిని జాగుసేయక మా

ప్రభునకిచ్చి వివాహముచేయుఁడు. అందునకుఁదప్పిన యుద్ధము సిద్ధమని మా రాజుగారు మనవి చేయుమనిరి.

సింధియాదూత:—అయ్యా! మా ఱేఁడు రాజాధిరాజుగదా? వారికోరిక నిరాకరింతురేని దానఁగలుగు కష్టములు మీరే యెఱుఁగఁగలరు. "కృష్ణ మా యోధరాజును బెండ్లాడి తీఱవలయును. కానిచో నా సేనలా కార్యము నవలీల నొనర్పఁగలవు" అని మా మహారాజు నుడువు మనెను. ఆవలమీచిత్తము.

భీమ:—మీయిరువురిలో నెవరికోర్కెఁ దీర్చినను నా దేశము నాశమగుటయు, నా ప్రజలు బానిసలగుటయుఁ దప్పదు. అయ్యలారా! మిమ్ము బ్రతిమాలెదను. దయయుంచి మీఱేండ్లతోఁ జెప్పి కోప ముపసంహరింపఁ జేయుఁడు. నాకూఁతురు బ్రహ్మచారిణిగా నుండుననియు వివాహమే యాడదనియుఁ జెప్పుఁడు. వ్యర్థకలహములు తగవని వచింపుఁడు.

తే. గీ. పాలునీరుపోలిక రాచ • వారు కూడి
మనిన, భువియెంత సుఖదమై • తనరుచుండు?
తెగువఁ బరదేశరాజులు • తేఱిచూడఁ
గలరె మనదేశమాత్రపైఁ • గన్ను లెత్తి?

సిం॥ దూత:—అయ్యా! అన్నిమాటలు మాకు బనికిరావు. నేను సత్వరముపోయి సందేశ మెఱింగింపవలయును.

మీకు నిష్టమున్నను లేకున్నను, ఆమె సమ్మతి
సమ్మతింపక పోయినను యోధపురరాజునకు న
బరిణయమై తీరును.

జయ॥దూత:—స్వామీ! మీరాలోచింపుఁడు. వా
సామాన్యుఁడుకాఁడు. ఇడుమలఁ బడఁగలడు.

సిం॥దూత:—ఇన్ని పలుకులతోఁ బనిలేదు. మీరు న
నకు సన్నద్ధులై యుండుఁడు. నేఁబోయివచ్చెద-
కొందు. (నిష్క్రమించును.)

జయ॥దూత:—అట్లయిన మీరాజా తీసిపోవువాఁడు?
పోలుఁడును దండెత్తివచ్చును. సిద్ధపడుఁడు.
(నిష్క్రమించు.

భీమ:—ఆహా! నాగతి యింతకువచ్చినది? చక్కని
రైను గనుటయు నొక్కతప్పేయయ్యెఁగదా!

తే. గీ. అహాహా! లోకవృత్తియెటుల ♦ నమరుచుం
జలజముఖులకొఱకు నెట్టి ♦ కలుషకర్మ
ములనయినఁ జేయ వెనుదీయ ♦ రిలను మా
పశువులు! కలికాలమహిమ ♦ ప్రబలఁబోలు!

కృష్ణ:—(తెరనొత్తిగించుకొని తల్లితోను సోదరునితోఁ
శించి) తండ్రీ! వ్యర్థముగా నాయొక్క రమా
మనప్రియదేశము నాశమొంద వలనుపడదు.
నాకొక్క కోర్కెయున్నది వినుము. (మోకరించి
జోడించి)

చ. కొమరుఁడనైతినేని, ననుఁ గోమునఁ బెంచినవాఁడవయ్యు, యు
ద్ధమునకుఁ బంపకుందువె ముదంబున దేశముఁగావ? కూఁతునై
యమరుట, శత్రులక్షసమరమందు నెదుర్కొనఁజాలకుంటఁ బ్రా
ణములను ధారవోసియయినన్ మనసీమచుఁబోవనీ యనుమా.

మన దేశముకొఱకుఁ బెక్కుమారులు పోరాడిపోరాడి తమసర్వస్వ మర్పించిన యింతమంది జనులఁ గాపాడ నాయల్ప ప్రాణమొక్కటి యర్పించి నేను ధన్యను గాఁగూడదా? అయ్యో!

తే. గీ. నాదుసౌందర్యమే కారణంబు వీరి
ననికిఁ బురికొల్పు, దుష్టస్వమునకు రేప
ఇప్పుడు నారూపుమాసిన నృపులకత్తు
లాఱులకరుగు; నుదయపుర మొందు సుఖము

అన్నా! అదే నీ ఖడ్గము. ఇదే నా కంఠము (అని మెడవంచును.)

భీమ:—అమ్మా! కృష్ణా! ఏమి? ఏమి? మాకొఱకు నీయుసురుల నర్పించెదవా?

కృష్ణ:—ప్రియజనకా! అంతకంటె నెమ్మదికి వేఱుపాయము లేదు. నే మరణించిన నీ రాజకుమారులు శాంతింపుదురు. నాశవముకొఱకుఁ గలహింపరు.

శాంత:—తల్లీ! కృష్ణా! నీపలుకులు ములుకులవలె నాహృదయమును భేదించుచున్నవి. అమ్మా! నిన్ను నగుని కంటఁబడనిచోట దాచెదను. నీకేమిభయము?

కృష్ణ:—అమ్మా! నీవు నన్ను భద్రముగా దాఁపఁగలవు. కాని యాదవార్గులు నేను గనఁబడకపోయినను వారిపని మానరు. వారంతకుఁగల వారిపైఁ బడుదురు. దేశము నాశమొందును.

ఆ వె. కలుషమతులు చేరి ♦ చెలరేఁగి రెచ్చోటఁ,
పరమశాంతియెచటఁ ♦ బరిఢవిల్లు
నట్టిసౌఖ్యధామ ♦ మందునే వసియింతు
మర్త్యులేరు నన్ను ♦ మలపలేరు.

(తండ్రివంకఁదిరిగి)నాయనా! నీవుకొంచెమాలోచింపుము

ఉ. ప్రాణములన్న నాశగల ♦ పౌరులు పెక్కురుపాపమావిధిన్
ద్రాణము గోలుపోయి రిపు ♦ ధాటికిబాల్పడుకన్నముందుగా
క్షోణికి భారమైతినరు ♦ శూన్యసుమంగళనేనె భూమిపై
శోణితముల్ వెలార్చి దివిఁ♦జూడఁకొనంగలదానఁ బంపుమీ?

భీమ:—(తనలో) ఆహా! నాముద్దుబిడ్డపలుకు లెంతకొనియాడఁ దగినవి? ఆనీచులరీతిఁగని యది యిదివఱకే చావఁదలఁచుచున్నది. ఆమె పల్కిన దంతయు సత్యమే. ఆకూళ యోధపురీశుఁడు మహారాష్ట్రసేనా సాహాయ్యముతో నెత్తివచ్చి నారాష్ట్రమును ధ్వంసముచేసి యెడారిగా నొనార్పఁ జైచును.

కృష్ణ:—తండ్రీ! నీవైఖరిఁజూడఁ నీవు మంచిదారిలోఁ బడుచున్నట్లు తోఁచుచున్నది. నేనిప్పుడు చావకతప్పదు. ఆ

చచ్చునది మర్యాదతోఁ జచ్చుట మేలుగాదె? అన్నా! ఆపనినీది. మనకు మానహాని రాకుండఁ గాపాడునదియగు హేతినిదూయుము. వెనుదీయక నాశిరము నఱకుము. ఇదే యొగ్గియున్నాను.

అజిత:—(కత్తియొఱనుండి పెఱికి) ఓనారీశిరోమణీ! నీధైర్యసాహసములు నన్నుఁ బ్రేరేచినవి. నాకుఁ బూర్వస్మృతినిఁ గల్గించినవి. రాఁగల యుగమునందలి రసపుత్త్రికన్యలు నిన్నుఁ గూర్చిఁ గీతములు పాడుదురు గాక! నీ పావిత్ర్యము మెత్తురుగాక? (అని కృష్ణాకుమారి నేయఁ బోయెను. కాని యంతలోనె ధైర్యము చెడిపోయెను. కరవాలము నేలఁబాఱవైచి, రెండు చేతులతో మొగముఁగప్పికొని యేడ్చుచు) చెల్లెలా? క్షమింపుము. ఆ క్రూరకార్యమునకు నేను దగను. జూచిచూచి చంపఁ జాలకున్నాను.

తే. గీ. కడపటనిముసమందును • గాంతిచెడక
నిండుజాబిల్లిఁబోలు నీ • నెమ్మొగంబుఁ
జూడ నాధృతియంతయుఁ • శూన్యమయ్యె
నిన్నుఁజంపఁ జేతులురావు • కన్నతల్లి!

కృష్ణ:—(తల్లివంక జరిగి) అమ్మా! కూఁతుమానము చెడనున్నప్పుడు. రాజపుత్త్రిమాత యిచ్చు తుదికానుకను నాకు దయచేయుమని నిన్నర్థించుచున్నాను. నేను దాఁపుచుం

డంగనే ప్రాణములూడ్చి విషమునిచ్చి నామానముం
గాపాడుము. ఆనృపశునకములు వ్యర్థముగా నన్నపవిత్ర
పఱుపం జూచుచున్నారు.

శాంత:—అయ్యో! నే భరింపలేనే! (అని యేడ్చును.)

కృష్ణ:—(గర్వముతో) నిన్నేయడిగెదను. నాకు మాఱుగాదు.
నీవు గన్న యీశరీరమును నీవు రక్షించుకోవా!

శాంత:—(దుఃఖించుచుం బోవుచు) కూంతు కడపటికో
ర్కెందీర్పని కఠిన హృదయ యగు తల్లి యుండదు.
అయ్యో! అయ్యో! నాకు గతియేది? హా! హా!

(అనిపోవును)

కృష్ణ:—(చిఱునగవుతో)

తే. గీ. వగపుం జెందకు నాయనా! ◆ వందురకుము
సోదరా! మున్ను రసపుత్ర ◆ సుందరులెటు
శత్రుకరములం బడకున్న ◆ జ్వాలంబడుచు
తగవటంచు సమసినారో ◆ తలంపుండయ్య?

అజిత:—అమ్మా? ఆయవస్థ వేరు. అప్పుడు మగవాండ్రును దమ
యోపినకొలందిం బగతుర ద్రెగటార్చి వీరశయనము
నలంకరించిరి. ఇప్పుడో—

కృష్ణ:—ఇప్పటి మనుజులే వేరువిధమైనవారు. ఇప్పుడు జనులు
శాంతినే కోరువారు. (అజితతో నొక గిన్నె చేతం బట్టుకొని
శాంత ప్రవేశించును.)

అమ్మా! ఇప్పుడు నాకు మోదమయ్యెను. [గిన్నెనందుకొని] జననీజనకులారా! సోదరా! నేనిదే సూర్యవంశమందలి ప్రతిరాజకుమారుని శ్రేయస్సునుగోరి విషముం గ్రోలి ప్రాణమును బరిత్యజించుచున్నాను. (త్రాగును. ఒక నిముసము నిలుచును. తల్లివంకఁ దిరిగి) అమ్మా! నీవు నన్ను మోసము చేసితివి. విషమన నీరనియు నర్థము కలదు. గావున, దానిని దెచ్చితివి కాఁబోలు కానిమ్ము. అయిననేమి? దానిని నేనే సిద్ధపఱచుకొనఁగలను. ఇదే క్రోలి దీర్ఘనిద్రఁబోయెదను.

తే. గీ. నిష్కళంక వర్తనులార! • నెమ్మినన్నుఁ
గన్న జననీజనకులార! • కరము నాదు
ముద్దుముచ్చటలనుజూచి • మురియుసోద
రప్రకాండమా! సెలవిందు • రానుమరల.

(నిష్క్రమించును. వగచుచుఁ దల్లి వెంబడించును.)

భీమ:— (తెల్లని గడ్డముపైఁ గన్నీరుగార్చుచు) ఆహా! దైవమా! ఎట్టి కష్టములు గల్గించితి వీ రాచపుట్టువునకు? (ఆలోచనాదృష్టితో) అవును. ఇదితప్ప మఱియొకదారి లేదు. ఎప్పుడు ప్రబలవిరోధులు దానివరించిరో యప్పుడే దానిమృతి ధ్రువమనుకొంటి. (క్రోధముతో) నాకన్నకూఁతురు మడియుటకైన సమ్మతింతుగాని యాచండాలునకు యోధపురేశునకు మాత్రము నాబిడ్డనీయను.

అజితు:—యుద్ధమొనర్చెదమన్న వారు బలవత రాలులాభము లేదు.

(ప్రవేశము:— సేవకుడు.)

సేవ:—మహాప్రభూ ! కరడూరురాజు సగ్వాంతసింగుగారు హజారమున వేచియున్నారు. దేవరనుజూడఁగోరుచున్నారు. గుఱ్ఱముపైఁ దొందరగావచ్చినట్లు తోఁచుచున్నది.

భీమ:—లోనికి రానిమ్ము. (సగ్వాంతుఁడు తొందరతోఁ ప్రవేశించును).

సగ్వ:—(తడఁబడుచు) మ-హా-ప్ర-భూ ! కృష్ణాకుమా-రి సజీవ-యై-యున్న-దా? (రాజును గొడుకును నొండొరులు చూచుకొందురు.) (కొంచెము కుదురుపడి) ఏలయట్టు లడుగుచున్నానందు రా ? నాబోటివాఁడు జీవించియుండ నామె యాత్మహత్యఁగావించు కొననెంచెనని కింవదంతి పుట్టెను. దాననింత వేగమ యిలువెడలివచ్చితిని.

తే. గీ. దేవ ? సగ్వాంతసింహుని ♦ దేహమందు
నసువులింక నిలిచియుండ ♦ నబల కృష్ణ
యూరక తనమేనువిడువ ♦ నోర్వఁగలఁడె ?
ముసలిననియెంచకుఁడు, భువి ♦ మంచివైతు.

(తెరలోపల నాహాకారములు వినిపించును.)

శాంత:—(తెరలో) హా ! కృష్ణా ! ఎంతసాహసికురాలవే ? నీకు మాతృదేశముపై నెంతప్రీతియే ! తల్లీ ! నీగుణములెట్లు

మఱవఁగలము. నీమోహామునెట్లు మాహృదయముల నుండి పాఱఁదోలఁగలఁము.

తే. గీ. కలకలమను నీముద్దుమో ♦ మిలను జంద్రుఁ
డుండునంతఱకు మఱి ♦ పొందగలమె ?
తల్లి ! నీవంటిగుణరాశి ♦ ధరణి నెన్ని
జన్మములనెత్తినను మాకు ♦ సాధ్యమౌనె ?
(అనియేడ్చును.)

సగ్వ:—(ఆలకించి) అట్లయినఁ గృష్ణమరణించెనా ? ఏమి ?

శాంత:—(తెరలో బిగ్గఱగా) నాథా ! మనభాగ్యలక్ష్మి వెడలి పోయినది. ఇఁక రాదు. (అనిదుఃఖించుచు మూర్ఛిల్లును. అజతుఁడు వగచును. రాజు మౌనిన్పడియుండును)

సగ్వ:—(తలవంచి కన్నీరురాల్చి, పిమ్మటఁగన్ను లెఱ్ఱఁజేసి రాజు వైపుచూచి)ఓరాజా! నాపూర్వులు ముప్పది తరముల నుండి మీపూర్వులసేవించిరి. మనమిరువురము సమాన వయస్కులము. చిన్ననాట నుండియు మీ యూడిగమునందుంటిని. కాని తుదకు వ్యర్థుఁడ ననిపించుకొంటిని. ఇదే నాకత్తిని మీ పాదముల మోలనుంచితిని. నేడు మొదలు నీకు సేవఁజేయను. నేను నచిరకాలము లోనే గృష్ణను గలసికొందు. సెలవిండు పోయెద.

(నిష్క్రమించును.)

(తెరవాలును.)

# పున్నా బాయి

ఇందువచ్చు పాత్రలు.

వనవీరుడు:—బాలుడగు నుదయసింగునకు మంత్రులు నియమించిన సంరక్షకుండు.

ఉదయసింగు:—చిత్తూరు రాణా.

వీరాబాయి:—ఉదయసింగు భార్య.

పున్నాబాయి:—ఉదయసింగుని బెంచినదాది.

ధానకుడు:—రాణాలకు భోజనము తెచ్చుమంగలి.

సోనిగుఱ్ఱప్రభువు:—ఒకసామంతరాజు—వీరాబాయితండ్రి.

అసాసా:—ఒకకోమటి—వర్తకుడు—జైను మతస్థుడు.

అసాసాతల్లి, కొందఱాశ్రితులును గలరు.

కథాసంగ్రహము:—బేబరుచక్రవర్తి హిందూదేశముపై దత్తునప్పుడు చిత్తూరురాజ్యము సంగరాణా పరిపాలనములోను ప్రబలముగా నుండెను. బేబరు మిత్రభేదముచేసి రాణాను కహాయొద్ద 1527 సం॥ మార్చి 27 వ తేదీని నోడించెను. ఎప్పనోటమియన నెఱుగనిసంగుడు యుద్ధానంతరమున బెంగకొని చనిపోయెనట. సంగుని మరణముంగూర్చి పెక్కులుపెదెఱంగులఁ జెప్పుదురు. అతని జ్యేష్ఠపుత్రుఁడు రత్నసింగు

య్యెను. కాని యతఁడొక కాంతను బెండ్లియాడియు విడిచిపెట్ట నామెను మరల నింకొకఁడు పెండ్లియాడ, నాతనితోఁ బోరి శత్రు నితోఁబాటు తానును మృతుఁడయ్యెను. అప్పుడు సంగరాణా భార్య లెవరికివారే తమకొడుకులకు రాజ్యమిప్పింపఁ బ్రయత్న ములు సలిపిరి. వారిలో జవాహీరుబాయి యనురాణి తనపు త్త్రుని విక్రమజిత్తుని రాజ్యలబ్ధునిగఁ జేయఁగలిగెను! విక్రమజిత్తు నకుఁ దండ్రిదాతలకుండు గొప్ప గుణములలో నొక్కటియు లేదయ్యె. అదియట్లుండ నతఁడు రసపుత్త్రసేనావిషయమునఁ గొన్నిమార్పులు చేసెను. ఎన్నఁడును వాడుకలేని తుపాకుల నుపయోగింప నాజ్ఞయిచ్చెను. ఏనాఁడును గుఱ్ఱముపైఁగాని యుద్ధము చేయమని నియమముగల రాజపుత్త్రులను గాల్బలముగా నేర్పడుఁడని నిర్బంధించెను. ఇవన్నియుఁ బ్రజలకుఁ గిట్టకుండెను. సామంతరాజులు స్వాతంత్ర్యము వహింపజొచ్చిరి. రాజ్య మరా జకమయ్యెను. ఇట్టితఱి గుజరాతునేలు బహదూర్‌షాయను నతఁడు మున్ను చిత్తూరురాజులు మాళవదేశపు నవాబును ఖయిదీగాఁదీసికొని వాని కిరీట మపహరించి యవమానపఱిచి రనివిని, యిది ప్రత్యపకారము చేయుటకుఁ దగినయదనని యెంచి దాడివచ్చెను. అప్పుడు రసపుత్త్రులకుఁ దురకలతో ఘోర యుద్ధమై యందు సర్వనాశమయ్యెను. స్త్రీలు జహారవ్రతము సలుపఁ జొచ్చిరికిరి. రాణీకర్ణావతి చిచ్చులోఁ జొచ్చుటకుఁ బూర్వము హుమాయూనుని శరణు వేఁడెను. కాని యతఁడుఁ

సమయమునకు రామిఁ దనకొడుకు నుదయసింగును భద్రముగా దాపించి తానగ్నిలోఁ బ్రవేశించెను. అంతయు ముగిసిన వెనుక వామమార్యూనువచ్చి, శత్రువులఁ బాఱఁద్రోలి, యుదయసింగు కొఱకు వెదకించెను. కాని యతఁడు కాన్పింపకపోవుటచేఁ గొన్ని నియమము లేర్పఱిచి విక్రమజిత్తునే సింహాసనమందు నిలిపిచనెను. అయిన నతనిరాజ్యము జనులకేమియుఁ గిట్టకుండెను. దేశ మల్లకల్లోలమయ్యెను. పట్టపగలే దోపిడులు జరుగఁజొచ్చెను. అప్పుడు మంత్రు లాలోచించి పృథ్వీరాజున కొక దాసివలన గలిగిన పుత్త్రుని వనవీరునిరావించి యుదయసింగునకు సంరక్షకునిగా నియమించి విక్రమజిత్తును సింహాసనభ్రష్టునిగఁ జేసిరి. అతఁడు రాజ్యకాంక్షచే నందఱను జంపఁదలంచెను. కానిపున్న యను నొకదాసిచేసిన సత్ప్రయత్నములచే నుదయసింగు ప్రాణములు మాత్రము కాపాడఁబడెను. వనవీరుని దౌర్జన్యమందఱికి దెల్లమై యందఱును గక్షవహించి యాతనిం బాఱద్రోలి యుదయసింగును గద్దెపైనిలిపిరి. ఇందుఁ బున్నపడినపాటు మిగుల సంస్తవనీయము. ఈచిన్ననాటకమువలన నామె చూపిన రాజభక్తియు స్వార్థత్యాగమును దేటపడును.

---

# పున్నాబాయి

## ప్రథమరంగము.

రంగము—చిత్తూరుపుర బాహ్య ప్రదేశము.

(ప్రవేశము—వనవీరుడు గుఱ్ఱముపై నెక్కి.)

వనవీరుఁడు—(స్వగతము) ఆహా! నేను మహాపరాక్రమవంతుఁడగు పృథ్వీరాజునకుఁ గొడుకునయ్యు, హీనకులజగర్భమున జన్మించినవాఁడనౌటచేఁగా, యీ పూర్వాచారపరాయణులగు మంత్రిశిఖామణులు, నీయవివేక శిరోమణులగు పౌరులును నన్ను నిరాకరించి రాజ్యము మఱియొకని కీయఁజూచుచుండిరి? రాజ్యపరిపాలనార్హతను బొందుటకు క్షత్రియులై యేపుట్టవలయును గాఁబోలు? మున్ను శూద్రకులజులెందఱు క్షితిని బాలించి కీర్తిని బొందియుండలేదు!

ఉ. సూతకులంబునందున బ్రసూనమునొందియు నంగసీమకున్
నేతగనుండి పాలనము ♦ నేర్పునఁ జేయఁడె కర్ణుఁడు; దత్తతిన్
నీతివిశారదుల్ గురులు ♦ నిందలొనర్చిన రాజరాజు రా
ధాతనయున్ మహీపతిగఁ ♦ దా నెలకొల్పఁడె తత్సుధీజ్ఞుఁడై.

ఎన్ని విధంబులనాశక్తిఁ బ్రకటించినను, బ్రజానుకూలముగఁ బుడమి నేలెదననియుఁ బూర్వమర్యాదలకు భంగము రానీయననియు నెన్ని తెఱంగుల వచించినను, నామాటలు వీటిపుచ్చి, మఱియొకనినే రాజ్యారూఢునిగఁ జేయ నిశ్చయించిరి

గదా మంత్రులు ? కానిమ్ము సమయము రాకపోదు. ఈయప్ర యోజకులా రాజ్యము నేలువారు? నాపక్షమవలంబించిన ప్రధానునొకరిద్దఱు కలరు గదా! వారు మంచివక్తలు. వారు తమ వాదమునందు గెలుపొంది నన్ను సింహాసనాధిష్ఠునిం జేయం గల్గుదురేని, నావిరోధులపైం గసిందీర్చుకొని రాజ్యము నిష్కం టకముగాం జేసికొని సుఖముగం బరిపాలింపకపోదునా ? శూర సింహుండగు నాతండ్రినాంటిన బీజము సద్వృక్షమై నెగడక రిత్తవోవునే ! అదే యెవ్వండో యాశ్వికుం డీవంకకే వచ్చు చున్నాండు. నన్నుం బట్టి బంధింపుమని విరోధి మంత్రివర్గము పంపియుండలేదుగద? రానిమ్ము. నాచేతిలోం గరవాలమున్నంత వఱకు నాకు భయములేదు.

(ప్రవేశము — ఒక యాశ్వికుడు.)

ఆశ్వి:—వనవీరమహారాణావారికి జయము. మహాప్రభూ! మంత్రులు మరల సభచేసి తమ్ము బాలకులగు నుదయసింగు మహారాణావారికి సంరక్షకులుగా నియమించిరి. ఏలినవారి కిదివఱ కాశాభంగము గల్గించి నందులకు మన్నింప వేడిరి. తాము సత్వరమువచ్చి రాజకార్యముల నిర్వహింపవలయును.

తే. గీ. రాజ్యమల్లకల్లోలమై • రాణం దక్కెం;
విచ్చలవిడిం జరించెదు • విక్రమజితుం;
దర్భకు నుదయసింహుం గా • పాడువారు
లేరు; నీవెదిక్కిక వన • వీరప్రభువ !

వన—(కొంచెము సేపాలోచించి) ఒరుల రాజ్యమును నిర్వహించుట కడు దుష్కరము. అయినను నేను గేవలదీనరక్షణోద్దేశముతో మొట్టమొదల నియ్యకొంటిని. కాని నాపై గరుణించి మంత్రులు సమ్మతింపలేదు. సంతసముతో నిలయమునకు నేఁబోవుచుండ మరల రమ్మందు వేమి? నాకెంత మాత్రమును సమ్మతముగా లేదు. పొమ్ము.

ఆశ్వ—స్వామీ! మీరట్లనవలదు. తమశక్తిమంత్రులెఱుంగరు. వారి యవాచ్యముల మన్నించి జనులఁగావ రండు. ఆలస్యమైనఁ గార్యము చెడును. మఱియు మీకుఁ బూర్ణస్వాతంత్ర్యమిత్తురు.

వన—అటులైన సరియే. నాకిష్టము లేకున్నను భాగ్యజనులరక్షణ మవశ్యముగాఁ జేయవలెను గదా? పద. వచ్చుచుంటిని. (తనలో) నాకోర్కి యీడేఱినది. ఇఁక నాశక్తిఁ జూపెదఁగాక! (నిష్క్రమింతురు.)

---

## ద్వితీయ రంగము.

స్థలము—రాజాంతఃపురము.

ప్రవేశము:—పున్నాబాయి యనుదాసి, స్వామిదత్తుఁడను నాతేండ్లబాలుఁడు—పున్నకొడుకు, ఉదయసింగు ఆతేండ్లరాకుమారుఁడు. (ఉదయసింగు పాన్పుపైఁ గూర్చుండి యుం

డును. పున్న చెంతఁగూర్చుండి చిత్తూరురాజుల పూర్వచారిత్రములఁ జెప్పుచుండును. స్వామిదత్తుఁడు వింజామరము వీచుచు నొక ప్రక్క నాసీనుఁడై యుండును.)

ఉదయసింగు:—పున్నా! మావంశములో మొదటివాఁడగు బప్పారావు లొక్కమారే యాఱువందలమంది భార్యలను బెండ్లియాడినాఁడంటివి. నిజమే? ఆకథఁ జెప్పు.

పున్న:—నాయనా! నిజమే. బప్పఁడు తల్లితో నాగేంద్రగ్రామమునఁ గాపుర ముండెడివాఁడు. అప్పుడాతఁడు పసులఁ గాచుకొనుచుండెడివాఁడు. ఒకయేఁడట్లతద్ది పండుగ కాయూరి బాలికలందఱు నూరిబయటనున్న దేవాలయముకడ నుయ్యేలవన్ని విలాసముగా నందూఁగఁ దలఁచిరి. కాని వారికి మంచియుయ్యేల త్రాడు దొరక లేదు. ఆ దేవాలయప్రాంతమున బప్పఁడు తన పసులను మేపుకొనుచుండెను. అతఁడు వారియెదుటికి వచ్చి "మీరు నాతో నొక యాటయాడుటకు సమ్మతింతురేని మీకు మంచిత్రాడు తెచ్చియిత్తు" ననెను. వారొప్పుకొని యదేమి యాటయని యడుగ నతఁడు పెండ్లియాట యనెను. బాలికలు బొమ్మల పెండ్లిండ్లు చేసికొనుచు వారిలో వారే యొకరు భర్తగ నొకరు భార్యగ నుండుట వాడుకయే కావున నియ్యకొనిరి. అప్పుడు బప్పఁడాయాఱువందల గ్రామ బాలికల హస్తములను బట్టి

వారికొంగులతోఁ దన పైబట్టకొంగు ముడిపెట్టికొని యొక చెట్టుచుట్టును బ్రదక్షిణముఁ జేసెను. ఇదియే యతఁడాఱువందల స్త్రీలను బెండ్లియాడుట యందురు.

ఉదయ:—పున్నా! నీవు మా పెద్దల కథలు చెప్పుచుండ నెన్ని దినములైన వినబుద్ధిపుట్టును.

పున్న:—బాబూ! ఇట్లు మీ పాదసేవ జేయుచు మీకుఁ జెప్పు కథలే ముందు ముందు మీ నడవడినిఁ జక్కఁజేయును. మీరు పుట్టుక చేతనే శౌర్యవంతులైనను, మీకుఁదగిన శిక్ష లేకున్న మీ రాచఱికము వ్యర్థమగును. కనుక నేను జెప్పుకథలు మఱచి పోకుఁడు.

స్వామి:—అమ్మా! బాబుగారు పెద్దలగు దాఁక మఱొక బాబుగారు రాజ్యమేలెదరంట. నిజమే?

పున్న:—నిజమే నాయనా! కాని యీవచ్చువాఁడు ఘాతుకుఁడు. భగవంతుఁడు వానిని రానీకుండుఁగాక. మన బాబు చిరకాలము చల్లఁగా నుండుఁగాక.

(తెరలోఁ గలకలము వినిపించును.)

స్వామి:—అమ్మా! ఏదో యేడ్పు వినఁబడుచున్నది. నాకు భయమగుచున్నది.

ఉదయ:—ఓరీ! పనులు సరిగా జేయని బంటులను మంత్రులు కొట్టుచుండిరేమో! ఇంతమాత్రమునకే భయపడవలె

నఁటరా ? దొంగలెవ్వరయిన వత్తురని భయమున్న, జూచితివా యీ కత్తి ? ఇది మాబాబయ్యగారిది. దీని తో నొక్కపోటు పొడిచివేయుదును.

పున్న:—బాబూ ! నీవంతటివాఁడవే. ఏమియు భయములేదు. పండుకొనుఁడు.

(మంచముమీఁద నుదయసింగును, ప్రక్కనున్న చాపపై స్వామిదత్తుఁడును బవ్వళింతురు.)

పున్న:—(ఒక చేతితో రాకుమారుని, రెండవ చేతితోఁ దన కుమారుని జోకొట్టుచు జోలపాట పాడును.

(బాలురిరువురును సుఖనిద్రఁ బోవుదురు. మరల రోదన ధ్వనులు వినఁబడును. పున్న లేచి కొంచె మీవలకు వచ్చును. ధావకుఁడు ప్రవేశించును.)

పున్న:—ఓయీ ! ధావకా ! ఏమీకలకలము.

ధావ:—అయ్యో ! యెఱుఁగవా? మంత్రులు వనవీరుని బాబు గారికి సంరక్షకులుగా నియమించిరి. అతఁడు కోటజొచ్చి విక్రమ సింహుని నతని కుటుంబమును వధించి యడ్డు వచ్చిన సేవకుల నెల్లఁ జంపించు చుండెను.

పున్న:—ఓరీ! నీవు గడియక్రింద బాబుగారికిభోజనపదార్థములు పట్టుకవచ్చితివిగదా ? అప్పుడీ విషయమును గూర్చి చెప్పవై తివేమి ?

ధావ:—అమ్మా! వనవీరుడుగారు సంరక్షకులుగా నియమింప బడుట నీవు నెఱిఁగియే యుంటివని తలఁచితిని. అది యును గాక వారింత ఘోర కార్యము చేయు వారని యెఱుఁగక పోవుటచే వారినిఁ గూర్చి తలపెట్టలేదు.

పున్న:—నీ వమాయకుఁడవు. నీకు లోకవృత్తి తెలియదు. ఆ నీచుఁడు మన బాబును బ్రతుకనిచ్చునను కొంటివా? రాచపురుగేది మిగిలినను వనవీరునకు క్షేమకరముగాదు గదా? కావున మనము జాగ్రత్తపడవలయును. (అని యించుక సేపాలోచించి, చప్పున గదిలోనికిఁ బోయి రాజకుమారుని శరీరమున నున్న నగలను విలువబట్టలను దీసివైచి వాని నొక పండ్ల గంపలోఁ బండుకొనఁబెట్టి మీఁద గొన్ని యాకులను బండ్లను గప్పి, ధావకుని కం దిచ్చి) ఓరీ! నీ వింక నాలస్యము చేసిన మించివచ్చును. నీవీక్షణమే యిచ్చట నుండి పోయి నదిలో నిసుక తిప్పమీఁద నీగంపఁ బెట్టుకొని కూర్చుండుము. నేనుం ద్వరలో వచ్చి మిమ్ముఁ గలిసికొనియెద.

ధావ:—(వడఁకుచు) అమ్మా! ఆలాగుననే చేసెదను. (అనిగంప నెత్తుకొని పోవును.)

పున్న:—(స్వగతము) నేను వేశ్యాకులమందు బుట్టిన యబల నైనను, క్షత్రియ రక్తము నా రక్తనాళములఁ బ్రవహిం చుచున్నది గానఁ బౌరుషముఁ జూపఁజాలనే? అదియట్లు

లుండ నొక వేళ నా ప్రయత్నములకు నడ్డంబులువచ్చి నాకు బ్రాణభయమొదవినను నొదవుఁగాక ! ఇంత కాలమును వీరి యన్నముం దిని పెరిఁగిన నేనీ కుటుంబమువారి కీమాత్రి ముపకారము చేయకుందునే ? చేయకున్న నా బ్రతుకు వ్యర్థముగాదె ? ఇప్పుడు వనవీరుడు వచ్చి రాజపుత్త్రుఁడేడియన నేమి పల్కుదు ? ఏమి యుపాయము ?

ఉ. పసిపాపండగు రాజపుత్త్రునికి నేఁ ♦ బాలిచ్చి నీర్పోసి నా
నిసుఖంబేమది నెంచియింతదనుకన్ ♦ బ్రేమంబుతోఁ బెంచితిన్ ;
విసముంబూసినకత్తి నాఁదగిన యీ ♦ విద్వేషి కేలీల నీ
కసుగాయం గనుచప్పగింతుఁ ద్రుటిలో ♦ ఖండింపఁగా నిర్దయన్ —

(ఆలోచించి) ఇట్లగుఁగాక ? ఈ భూషణములును మేల్దుకూలములును నా పుత్త్రునికిఁ దొడిగియుంచెద. ఆక్రూరుఁడు రాచబిడ్డఁ డేఁడింపని యడుగ వీనిఁ జూపెదను. వాఁడు నిజమానుకొని వీని (డగ్గుత్తికతో) ఖండించి నెమ్మదిఁ జనును. రాకుమారుని నిర్భీతిగాఁ గొనిపోవచ్చును. ఇట్టులొనర్చిన వంశము నిలుచును. నేను ధన్యజీవిని నగుదును. కాని, యయ్యో !

చ. కడుపున గన్న చిన్ని సుతు ♦ ఖండనజేయుమటంచు వైరికిం
దడఁబడకప్పగింపఁగల ♦ తల్లిని ఘాతుకురాలిఁ గంటిమే
పుడమిని వ్యాఘ్రమొక్కటియు ♦ బున్నయొకర్తయు దప్పు? దైవమా
బుడుతనిఁ జేతులార నెటు ♦ పోవిడుతున్ ! విడకుండు టెట్టులో

ఇప్పుడు కన్నకొడుకునైన నర్పించి రాజు ప్రాణముల నిలువఁబెట్టుట కర్తవ్యము. నాకొడుకు మరణించిన లోకమంతగా దుఃఖింపదు. కాని సమస్త ప్రజ కాధారభూతమగు రాజు మృతినొందిన లోకు లాకులంపడుదురు. కావున నెటులైన బుత్త్రికుని గోల్పోవక తప్పదు. అయ్యో! అయ్యో!

ఆ. వె. సార్వభౌముఁడైన ♦ సామాన్యభటుఁడైన
దల్లికొక్క రూప ♦ తనయుఁ డగును
నటకట ! యిప్పుడెట్లు ♦ కడుపుదీపిఁ మెలంతు
నాతినైన నాది ♦ జాతి గుండె !

ఇఁక నాలసింపరాదు. అదేదవ్వున నెవ్వఁడో కన్పట్టుచున్నాడు. (అని యుదయసింగు నొడలినుండి యొలిచిన భూషణాంబరములు స్వామిదత్తునకుఁ దొడిగెను.) నాయనా! స్వామిదత్తా! నీవిపుడు నిక్కువముగా స్వామిదత్తుఁడవైతివి. (కన్నీటితో) ఇన్నినాళ్ళను బెంచియిప్పుడు ఘోర కిరాతునికిఁ జంపనిన్నప్పగించు చున్నాను. పొమ్ము. ఇఁకముందు నీకు భూదేవియేతల్లి. పోయి యామెగర్భమున సుఖనిద్రపొమ్ము.

(ప్రవేశము:—ఖడ్గపాణియై వనవీరుఁడు. పున్న దిగులుపడి నిలుచును.)

వన:—అమ్మా! నీయధీనమందున్న రాజకుమారుఁడేఁడి ?

పున్న:—(తలవంచి కన్నులఁ బొటపొట నీరురాల్చుచు మిన్నకుండును.)

వన:—నీబుడిబుడియేడ్పు లిచ్చటఁ బనికిరావు. చెప్పుకొనుము. లేకున్న నీప్రాణములఁ గూడ హరియించువాఁడ.

పున్న:—(దీనముగా) మహారాజా! ఆదేరాకుమారుఁడు పండుకొని సుఖనిద్రపోవు చున్నాఁడు. నిష్కారణముగా నాతని జంపకు. నోరెఱుఁగనికూన. మీనెయ్యమును గయ్యమునుగూడ నెఱుఁగఁడు. ఈపసివాఁడే నీకడ్డంకి యనితోఁచిన నాతనిఁ గారాగృహమందు వేయుము. లేకున్న నీయిచ్చవచ్చినచోటికిఁబంపుము. కాని యసురులు మాత్రము తీయకుము.

వన:—(కండ్లెఱ్ఱచేసి) ఓహోహో! నీవా నాకుబుద్ధులుగఱుపుట? ఇఁక నధికప్రసంగముమాని దత్తారముగాబొమ్ము. మీ రాకుమారుఁడిక సుఖతరనిద్రపొందునులే. (అని పాన్పుపైనున్న పాపనిఁ బూపపిందెకైవడి సరుకకొనఁ గత్తితో నఱికెను. బాలుఁడొక్క కేకవైచి మృతిఁజెందెను. పున్నయు, హా! నాయనా!' యనియఱచి మూర్ఛిల్లెను. వనవీరుఁడు జయసూచకములగు చూపులతోఁ జనెను.)

పున్న:—(తెలివినొంది లేచి పుత్త్రునిపైఁబడి యేడ్చి) తండ్రి! ఇఁక నీభారము నాకుఁ దీఱినది. నే నెచ్చటికిఁబోయిన నొంటికత్తెనై పోవచ్చును.

తే. గీ. దైవమా! పాపమెఱుఁగని ♦ తనయుని బలి
గా సమర్పించి రాసుతుఁ ♦ గాచియుంటి

భవదమోఘసంకల్ప మా ♦ పగిదిఁదీఱె;
శాంతినొసఁగు మీయాత్మకు ♦ శాంతినిలయ!
తే. గీ. కూర్మిర! వనవీర! యనిమిత్త ♦ కోపమూని
కేవలమహాత్ముఁ గాంక్షించి ♦ కీడురోసి
తిన్ని పాపిణముల కొకట; ♦ నిదియె చేటుఁ
గాలము సవిశాపమయ్యెరా ♦ కాచికొమ్ము.

నేను గణికనైనను బరమవిశ్వాసముతో రాజసేవయొన రించి ధన్యనైతినని యాత్మతృప్తి నొందినదానను. నామాట రిత్త వోదు. నిర్భాగ్యుఁడా! వనవీరహంతకా! నీకుఁ జావుమూడినది. (అని యచ్చోటు వాసిపోయెను.)

## తృతీయరంగము.

రంగము—నదియొడ్డు.

(ప్రవేశము:—ధావకుఁడు, గంపలోనున్న యుదయసింగు.)

ధావ:—పున్న యింకను రాదయ్యె. ఆమె కేమికీడుగల్గినదో? దేవుఁడు చల్లనిచూపుఁ జూచి మాచిన్న పెబువును గాపాడుఁగాక. ఇఁకనొక గడియవేచియుండి, యెచ్చటికైన నీతనిఁ గొంపోయెద. అల్లదె! దూరమున నొక యాకారము కాన్పించుచున్నది.

(ప్రవేశము—పున్నాబాయి)

పున్న:—ధావకా? బాలుఁడు సుఖయా?

ధావ:—అమ్మా! సేమమే. కాని యింతయాలసించితిరేల?

పున్నా:—(కన్నీటితో) బాబుగారి ప్రాణములకొఱకు మా స్వామిద్రోహిని ప్రాణము లర్పింపవలసివచ్చినది.

ధావ:—ఏమి! మీబిడ్డనిఁ జంపెనా యాదుష్టుఁడు? ఎంతఘోరకార్యము! తరువాత?

పున్నా:—(ఏడ్చుచు) అవును. (పిమ్మట ధైర్యము తెచ్చుకొని) తరువాత కల్లవినయమునుజూపి యంగఁటికడ సెలవుఁగైకొని, పుత్త్రునికొఱకులోనను రాజకుమారునికొఱకుఁ బైకిని రోదనముచేయుచు, వేఱొక తావునకుఁబోయి యాశిగముఁజేసికొందునని చెప్పి నమ్మించివచ్చితిని. ఇఁక రాచబిడ్డఁడు బ్రతికినాఁడు. ఎటకైనఁగొనిపోయి సంరక్షింతమురమ్ము.

ధావ:—చిత్తము—(అందఱు నిష్క్రమింతురు.)

చతుర్థరంగము.

రంగము—మహారణ్యసీమ.

(ప్రవేశము:—పున్నా, ధావకుఁడు, రాచబిడ్డఁడు.)

పున్నా:—(తనలో) ఆహా! దైవమా! నాకెట్టిగతి పెట్టితివి! చిత్తూరురాణాల యపారకృపచే నిల్లువిడచి పదియడుగులైన బయటికివెడలకుండ నింతదనుక బ్రతికితిని. ఇప్పుడు యోజన మొక్కయడుగుగా భావించి కొండలనక, వాఁగులనక, పవలనక, రాతిరియనక, తిరుగుచున్నాను

ఇదంతయు నీపాపని (గాపాడుకొనుటకుగదా? ఎన్నిచిక్కు లఁబెట్టినను నీపుత్రుదకు జయముఁజేకూర్తువనియే నమ్మి ధైర్యముతో (దిరుగుచున్నాను.

ధావ:—అమ్మా! ఎన్నోయిడుములఁబడి దేవలనగరమునకుఁ బోయితిమి. ఆయూరిరాజు వనవీరునికై భయపడి మనకుఁ జోటీయఁడయ్యె. పోనిమ్ము. మనబాబుగారికిఁ జుట్టమని దంజరుపుర రాజుదగ్గరకుఁ బోయితిమిగదా? అతఁడైన మనకష్టము కనిపెట్టెనా?. మంచిమాటలతోఁ దనవెఱపును దెలిపి పంపివేసినాఁడు. ఇప్పుడు మనమెందుఁ బోదము?

పున్న:—అల్లదె కమల మియరుకోట. అందిప్పుడు అసాసాయను కోమటి, జైనుమతస్థుఁడు, వర్తకుఁడు, కొంతసేనంగూర్చుకొని కాపురముండెను. వానిని శరణుఁజొచ్చుదము.

తే. గీ. వీరులమని ధీరులమని ♦ బీరములను
బల్కి తఱికి వెనుకదీయు ♦ వందలైన
క్షత్రబంధులకంటె వై ♦ శ్యకులజాతుఁ
బరమతప్రవిష్టు శరణ ♦ మరయుటొప్పు.

అదిగాక యితఁడు పరమదయాస్వభావుఁడనివింటిని. శరణాగతరక్షణ మతని మతధర్మము. దాని నాచరింపకపోఁడు.

ధావ:—సరియే. త్వరితముగ బోదమురండు. (నిష్క్రమింతురు.)

## పంచమరంగము.

ప్రవేశము—ఆసాసాయు వానితల్లియును.

స్థలము:—కమలధియరుకోటలోని యాగారము.

తల్లి:—నాయనా ! ఈనెలలో నీకెంతలాభమువచ్చినదిరా?

ఆసాసా:—అమ్మా ! పదిలక్షలు లాభమువచ్చినది. నీవు చల్లనితల్లివి గావుననీయాశీర్వాద మమోఘమై నాకు లాభపరంపరలు గల్గుచున్నవి. గురుదేవుని కరుణయు నీయాశిస్సును నాకుఁ దోడైయుండ నాకభ్యుదయమున కేమి కొఱంత? ఈస్థలమునకు మనమువచ్చిన వేళ మంచిదగుటచే మన తొలుతటి యిక్కట్లు లన్నియు నశింపఁగల్గవు.

తల్లి:—కుమారా ! మాదీవనలకంటె నీసౌజన్యమే నీవిజయములకుఁ బ్రబలకారణము.

ఒకభటుఁడు ప్రవేశించును.

భటుఁడు:—అయ్యా ! ఒకస్త్రీయు బాలుఁడును బురుషునొకని వెంటఁబెట్టుకొనివచ్చి తమకొఱకు వాకిట వేచియున్నారు. వారేవో కష్టములలో నున్నట్లు కాన్పించుచున్నారు. సెలవైనఁ దోడ్కొనివచ్చెదను.

ఆసా—శీఘ్రముగాఁ గొనిరమ్ము. (భటుఁడు నిష్క్రమించును.)

ఆసా—(తల్లితో) అమ్మా ! ఆస్త్రీ యెవ్వరై యుండనోపు ?

ఆ. వె. ఆర్తిఁ జెందివచ్చు ♦ వరియైన శరణంబుఁ
గోర నొసఁగుమనియె ♦ గురువునాజ్ఞ;
అబలయొకతె యిప్పు ♦ డర్భకుఁ గూడిరా
నాదరింపవలయుఁ ♦ గాదె తల్లి ?

తల్లి:—తప్పక యాదరింపవలయును. నీవు వారినిలోనికిఁ గొని రమ్మనుటలోఁ దప్పేమియు లేదు.

పున్నాబాయి యుదయసింహధావకులతోఁ బ్రవేశించును.

పున్న:—దయాసాగరా! శరణు, శరణు. (అని యసాసాకు బిడ్డని మ్రొక్కించి తాను మ్రొక్కును)

అసా:—అమ్మా! నీవబలవు. నీ కవశ్యము శరణమీయఁదగినదే. కాని మీకష్టకారణ మేదియో తెల్పినఁగాని నావాగ్దానము వృథయగును. కావున ముందు మీయార్తి యెట్టిదో యెఱుఁగఁజేయుము.

తల్లి:—కుమారా! ఆమెయార్తికి గారణమడుగనేల? నీవు నీగురుదేవు నాజ్ఞయే నెరవేర్పఁబూనితివేని కారణము లరయకుము.

ఉత్సాహ. చానయొకతె బాలుతోడ ♦ శరణు వేఁడుచుండెడున్
ప్రాణమైన ధారవోసి ♦ రక్షణంబుఁ జేయనా
మానవతినిఁ గాచుకంటె ♦ మహితకార్యమున్నదే?
యేనెపురుషనాదునేని ♦ నిటులఁదలఁకు చుందునే?

ఓయి ! నీవు తల్లిమాటయే పాటిసేయుదువేనిఁ గొంకక వీరికాశ్రయమిమ్ము.

అసాసా:—ఓనారీమణీ ! మిమ్ము రక్షింపుమని నామాతృదేవత యొక్కయు, గురుదేవుని యొక్కయు హృదయవాణి యొక్కయు, నాజ్ఞయైనది. కావున మీకుశరణమిచ్చితిని

శా. నారీరత్నమ! నిన్నుఁజూచెదనికన్ ♦ నాసోదరీతుల్యఁగాఁ?
గారాబంబునఁబెంచి యీబుడుతనిం ♦ గైకొందు మేనల్లుఁగాఁ;
ధీరుత్వంబునకున్కయౌ కులమునన్ ♦ వీరుండుజన్మించెనాఁ
వీరుంగాంతుఁదెమల్లుమీయిదుమలన్ ♦ వేవేలుగోల్పోయినన్.

సోదరీ ! ముందు నేనిచ్చు విందారగించి యవ్వలనీకతను విన్పింతువు గాని రమ్ము. (అందఱు నిష్క్రమింతురు.)

షష్ఠమరంగము.

{ అశ్వారూఢులై యుదయసింగును సోనిగుజ్జప్రభువును ప్రవేశింతురు. }

సోని:—కుమారా ! నాకు మాయమ్మాయి పీరాబాయి పుట్టినది మొదలు, దానిని జిత్తూరు రాణాకిచ్చి వివాహముఁ జేసి, తొల్లి రాణాహమీరునకు వితంతువైన తనకూఁతు నిచ్చి పెండ్లిచేసి వంచించిన మావంశములోఁ బూర్వుఁడగు మాల్దేవునివలనఁ గలిగిన యపకీర్తినిఁ బోగొట్టుకొన వలెనని బుద్ధిపుట్టినది. కానిపిమ్మట రాజ్యము వనవీరునిచే నాక్రమింపఁ బడెననియు; నీవువధింపఁబడితివని

యు విని యూవంక నిరాశగల్గినది. భగవంతుని యను గ్రహము నాపైనుండుటచే నిన్నినాళ్ళకు నాకోర్కి యీడేఱినది. మావీరాబాయిని నీకర్పించి ధన్యుడనైతిని. కుమారా! మాయమ్మాయికి,

మ. సరిలేనట్టి సురూపసంపదయు, యోషాభూషణంబైన భా
సురశీలంబును, మానినీజనులకున్ శోభస్కరంబౌ కళా
పరిపూర్ణత్వము, స్తుత్యమైన సమరవ్యాపారనైపుణ్యముఞ్
వరసౌభాగ్యముఁగూడియుండె; నెటులంబాలించికాపాడెదో?

ఉదయ:—మామా! నీకూఁతునకు సమస్తగౌరవములను నెఱపెదను. కాని యెవ్వడో యోధుఁడు, వనవీరుఁడు తన కొమరితకంపు సారెనడ్డగించి దోఁచుకొని యది నాయుద్వాహమం దుపయోగింప నిచ్చెనంటివి. ఆతఁడెవ్వఁడు వానినిజూడ నామనము వేగిరపడుచున్నది.

సోని:—ఆతఁడెవ్వఁడో నేనెఱుఁగను, చిరకాలమునుండి మీసేవ యొనరించినవాఁడట, అంతమాత్రమే యతనినుండి గ్రహించితిని.

ఉదయ—ఈమహోత్సాహ సమయమున మాపున్న లేకపోయినది. అదినాచెంతనున్న యనుమానమునకుఁ గారణమగునని యెటుకోఁచనినది. ఎచ్చటనున్నదో? ఏమియిడుమలం బడుచున్నదో?

చ. జననినివిూంచుకూర్మిననుసాకియుఁ,గన్నకుమారుప్రాణముల్
తునుముకొని నన్నుగావ నొక మూఢునకర్పణముంబొనర్చి, కా
ననముల గష్టముల్ గుడిచి నాకొఱకెందఱికాళ్ళఁబట్టి, కా
చిన గుణశీల పున్న కట! చింతవివాహపువేళ లేదుగా.

సోని:—ఆమె యట్టిదనియేయనాసావలన వింటిని. ఇప్పుడు సేనను సమకూర్చుటకగు వ్యయమంతయు ననాసాయేసువిూ మనకొఱకై వహించెను? (దిక్కులు పరికించి) మన మప్పుడే చిత్తూరును సమీపించితిమి. మన సేనలకు విజయమైనదో లేదో?

(ప్రవేశమిరువురు నవయౌవనవంతులగు నాశ్వికులు)

అశ్వి:—జయముజయము మహారాణా వారికి! మన సేనలుఁ శత్రుసేనలఁ దున్మి నిరాటంకముగాఁ గోటలోపలఁ జొచ్చినవి మన సేనానాయకుఁడదే జయపతాకమును బూని మిమ్మెదుర్కొనవచ్చుచున్నాఁడు.

సోని:—శుభవార్తఁ దెచ్చితివిగావున నీకిదె చంద్రహారము లను బహుమానముగా నిచ్చుచున్నాను. కైకొనుఁడు. నాయనా! ఉదయసింహా! నీవు దీర్ఘాయుష్మంతుఁడవై నేలయేలుము. (ఇచ్చును. వారుతీసికొందురు.)

సేనాని:—ఉదయసింహమహారాణా వారికి జయము. మహాప్రభూ! భగవదనుగ్రహముచేతను, సింహపరాక్రమశాలురగు నీయోధయుగళము చూపిన యసమాన శౌర్యముచేతను మనకు గెలుపుగలిగినది.

ఉదయ:—ఈయోధులెవ్వరు? మామా! వీరిలో నాపెద్ద యాతఁడేనాఁడు వనవీరుఁడు పంపుసారెను గొల్లఁగొట్టి మనకిచ్చినాఁడు. (యోధుని వంకఁ దిరిగి) ఆర్యా! మీ రెవరు? మాపై నింతయవ్యాజకరుణకుఁ గారణమేమి?

యోధు:—రాజా! నేనెవరో యీమె (నాలుకఁ గఱచికొని) కాదు కాదీతఁడు తెలుపును.

ఉదయ:—ఏమి? ఈతని తబ్బిబ్బుమాటలవలన నాకనుమానము గల్గుచున్నదే! (చక్కఁగాఁ బరికించి) ఈరెండవయోధుఁడు పురుష వేషమునను న్నాబహిఃప్రాణమాయేమి? అట్లయిన నీతఁడు మాక్షేమము పురుషుఁడెట్లగును?

రెండవయోధుఁడు:—(ప్రక్కకు వెడలి తనపురుష వేషమును దీసి వైచి వచ్చి) ఆర్యపుత్రా! నమస్కారము. తండ్రీ! నమస్కారము.

తే. గీ. చిన్నతనమునుండి మిముగా • చినసుశీల
పున్నయేనుఁడి యీయోధ • పుంగవుండు
మున్ను కొల్లఁ గొట్టిన ధన • ము లరణంబు
గా మనకు సమర్పించిన • ఘనుఁడితండె.

ఉదయ:—(పున్నపాదములపైఁబడి) నీవేనాకుఁ దల్లివి. ఎన్ని జన్మములెత్తినను, నాచర్మము నొలిచి చెప్పులుకుట్టి నీకిచ్చినను నీఋణముదీఱునా? నీవు హీనకులజవైనను పరమ పూజ్యురాలవు.

పున్న:—(లేవనెత్తి) నాయనా! నీకుఁ గళ్యాణమగుఁగాక. ఇఁక నీపట్టాభిషేకమొనరించి తృప్తిఁజెందెద. అసాసా మన కొఱకు వేచియున్నాఁడు. అతనిఁ గోశాధ్యక్షునిఁగా నియమించి బహూకరింపుము. సర్వమునాయ త్తమయ్యె. రమ్ము. (నిష్క్రమింతురు).

స మా ప్త ము.

---

# మీ రా బా యి.

ఇందువచ్చు పాత్రలు.

అగ్బరు:—ఢిల్లీ చక్రవర్తి, అబుల్ ఫజల్—అతనిప్రధానమంత్రి.
మీరాబాయి:—చిత్తూరురాణాయగు నుదయసింహుని భార్య.
పద్మినీబాయి:—ఉదయసింహుని సోదరి.
ప్రతాపసింహుఁడు:—రసఫుత్ర సైన్యములోని యొకసేనాధిపతి.
అబ్దుల్‌కరీమ్:—అగ్బరు నాస్థానమందలిమహమ్మదీయసైనికుఁడు
ఒక సిపాయి:—ద్వారపాలకుఁడు.

---

# పీఠిక

అగ్బరు చిత్తూరు రాజ్యముపై దండెత్తెను. రాణాయుద యసింహుడు తన పూర్వుల శౌర్యసంపద లేనివాఁడై పిఱికితన మును జూపెను. తన సేనలు కొన్ని యగ్బరుచే జయింపఁబడిన

వని తెలిసినవ్వా డతఁడు చిత్తూరును విడిచి యారావళీ పర్వత ములలో దాఁగుకొన నిశ్చయించుకొనెను. అతనిభార్య వీరా - బాయి సోదరి పద్మినియు నతని ననేక విధముల నెగతాళిచేసి యుద్ధమునకుఁ బురికొల్పిరి. కాని లాభములేకపోయెను. అతనికి సిగ్గువచ్చులాగున వారు పురుష వేషముల ధరించి యుద్ధరంగ మునకు సేనల నడిపిరి. సమరమందా చిన్న సేన యోటుపడెను. రాణియుఁ బద్మినియు నాత్మహత్య గావించుకొన నెంచిరి. కాని యెటులైనఁ జక్రవర్తి సమక్షమును బడసి యతనిఁ జంపి పగఁ దీర్చుకొని మఱి చావ నిశ్చయించుకొనిరి. చక్రవర్తి సంగీతప్రి యుఁడనియు, సన్యాసి పక్షపాతియనియుఁ దెలిసి వారుసన్యాసి రూపములఁ దాల్చి మత సంబంధమైన పాటలఁ బాడుచు బయ లువెడలిరి.

స్థలము:—యువరాజపురములోని యగ్బరుచక్రవర్తి శిబిరము.

అగ్బరొకపట్టుపరుపుమీఁదఁ దన గుడారములోఁ
గూర్చుండి యుండును. మంత్రి అబుల్ ఫజల్
సమీపమున నాసీనుఁడై యుండును.

అగ్బరు:—నిజమే. మనమే గెలిచితిమి. జయము మనదైనను. గౌరవము మాత్రము శౌర్యవంతులగు రాజపుత్రులదే. ఆ చిన్న సేన కధిపతియగు పడుచువాని జూచియే యుంటివిగదా? అతఁ డవహరించిన యుద్ధ దేవతవలె నున్నాఁడు. వానిఁబట్టుకొన సేవకుల కాజ్ఞ యిచ్చినాను.

కాని యతఁడు దొరకునని తోఁచదు. ఆహా! ఏమి వారి యీ ధన్యపుణ్యము!

చ. మెఱియలవంటిసైనికులు♦మిక్కిలిశౌర్యముఁబూనివెంటరాఁ
జురుకుఁదనంపువర్తనము ♦ చూపఁజికచ్చెరువుల్ జనింపఁజే
యు, రవుతొకండు మింటనుగ్ర♦హావళిమధ్యఁజరించుభానుపై
ఖరిఁ గనరాని తేజమునఁ♦గాంతులజిమ్ముచునేగఁగాంచితిన్.

అబు:—అవునఁట. రాజపుత్రులు మిక్కిలి శూరత్వముతోనే పోరాడిరని మన సైనికులు నుడివిరి.

అక్బ:—వారు రామలోఁ బ్రీతి మనుజుఁడును బ్రాణంబులు సమర్పింపవలయునని యెఱుఁగుదురు. అట్లయ్యు నేమి ధైర్యముతోఁ బోరాడిరి.

అబు:—శౌర్యమనగా నట్టిదేకదా! అది రాజపుత్రులకుఁగొంగు బంగారమే.

మీరాబాయియుఁ బద్మినీబాయియు సన్న్యాసుల వేషములఁదాల్చి, భగవన్నామ సంకీర్తనంబుఁ జేయుచుఁ బ్రవేశింతురు.)

దేవునిమదినిడి - జీవనమరయుఁడీ
కేవలము కీర్తి - దావలమదేసుఁడీ॥
భూవిభులమనుచుఁ - బూజ్యులమనుచును
గావరమునమనఁ - గార్యములేదుగా
అణువును మేరువు - నజునకు నొక్కటె

ఘనతయు న్యూనత - కనఁబడవతనికి
విజయునిగర్వము - విజితునిభంగము
వృజినము లేవియు - నెఱుఁగనిపరముని.

అగ్బ:—(వారిపాటవిని) (తనలో)ఆహా ! యీజడధారుల కంఠ ధ్వని యెంతయింపుగానున్నది. వారి పాటలో నెంత తత్వార్థముగలదు !

శా. వీణానిక్వాణనంబుఁ గంఠనదముల్ ♦ భేదింపరాసట్టు లి
మ్మానీంద్రుల్వినిపించుగానమెదకుక్ ♦ మాధ్వీరసప్రోక్షితం
బై నిల్పుండె ; సుడుల్మనోహరములై ♦సార్థంబులై యొప్పు ; నీ
యానందంబొడగూర్చువార లెవరే♦నారాధ్యులై మంత్రులుగా?

ఎవఁడురా, అక్కడ ?

ఒకసిపాయి:—(ప్రవేశించును) హుజూర్ ! ఏమిసెలవు ?

అగ్బ:—ఆపాడుచు వచ్చుచున్న వారెవరు ?

సిపాయి:— దేవా ! వారు హిందూ సన్యాసులఁట. వారిని గుడారము దరికి రానియ్యకుండ నాఁపుటకు మేము ప్రయత్నించితిమి. కాని వారు దేవరవారినిఁ జూచుటకుఁ జాలఁదొందరపడుచున్నారు. సన్న్యాసుల నాఁపఁగూడ దని దేవరవారాజ్ఞాపించుటచేత, నేమిచేయుటకు మాకు దోఁచుట లేదు.

అగ్బ:—వారిని లోనికి రానిమ్ము. (సిపాయి నిష్క్రమించును)

అబు:—కంఠధ్వనివలన వారు సన్న్యాసులవలెఁదోఁచరు. మొగ

మెఱుఁగని ప్రతిమనుజుని దేవరసాన్నిధ్యమునకు దాని
చ్చుట శ్రేయస్కరము గాదని నాయభిప్రాయము.

తే. గీ. విశ్వమందుఁ బయోముఖ ♦ విషపుఁబాత్ర
వంటివారెందఱో యుంద్రు ♦ వారిబాహ్య
వైఖరిఁ గనినంతనె భ్రాంతి ♦ పడగఁ రాదు ;
ప్రభువు లిదిగమనింపఁ గ ♦ ర్తవ్యమగును.

అగ్బరు:—నమ్మకమున్నచోట ననుమానమే మాత్రముండదు.
అనుమాన మున్నచో నన్నియు సందేహములే.

(సిపాయియా సన్న్యాసివేషములు దాల్చిన మీరాబాయియుఁ బద్మినీ
బాయియుఁ ప్రవేశింతురు.)

మీరా:—సర్వరక్షకుఁడైన భగవంతుఁ డీ మొగలాయి పాదుషా
కుఁ జిరాయు రారోగ్యైశ్వర్యముల నిచ్చుఁ గాత !

అగ్బ:—భగవంతుడేల ? సన్న్యాసుల గనుక మీరుఁ గూడ
నీయగలరు.

మీరా:—కాని మేము దైవసేవకుల మగుటవల్ల స్వయముగా
నిచ్చుటకుఁ దగిన వారముకాము.

అగ్బ:—(అబుల్ ఫజల్‌తో) చూచితివా, వారి కంఠ
ధ్వని యెంత శ్రావ్యముగ నున్నదో !

(మీరాబాయియుఁ బద్మినీబాయియు నొకరినొకరుచూచుకొనిరి)

అబు:—చిత్తమవును.

అగ్బ:—మీది యే దేశము ?

మీరా:—మేమిప్పుడే దేశమును మా దేశమని చెప్పలేము.

అగ్బ:—మీరీ సన్న్యాసాశ్రమమును స్వీకరించి యెంతకాల
మయినది ?

మీరా:—కొలఁది కాలము క్రిందటనే ప్రాపంచిక సౌఖ్యములను
విడనాడఁ గలిగితిమి.

అగ్బ:—మీకు భార్యలున్నారా ?

మీరా:—మా నిబంధనల ప్రకారము మేము భార్యలను బొందఁ
గూడదు.

అగ్బ:—అట్లయిన మీకుఁ బిల్లలైన లేరుకాఁబోలు ?

మీరా:—మేమెన్నఁడును భార్యలనే కలిగియుండలేదు.

అగ్బ:—మీరింకను బిన్నవయస్కులు. అప్పుడే సన్న్యాసులగు
టకుఁ గారణంబెద్ది ?

మీరా:—విధిప్రేరణముచేఁ జిన్నతనమునందే యిహలోక
సౌఖ్యములను విడిచిపెట్టవలసివచ్చెను.

అగ్బ:—నన్నుఁ జూచుటకు మీకంత యాతురమేల ?

మీరా:—(పద్మినివైపు చూచును)

పద్మిని:—సంగీతమునందును, సన్న్యాసులయందును మీకుఁ
గల యభిమానమే మమ్ములనిటకు రాఁ బ్రేరేపించినది.

మీరా:—దేశదేశములందును దమకీర్తినిఁ గొనియాడు పాటలను
వినుటవలనఁ జనిపోవులోపల మిమ్ముల నొకసారియైనఁ
జూడవలయునని మేము కృతనిశ్చయులమై వచ్చితిమి.

అబు:— దేవరవారి నీరోజుననే మీరుచూడఁ దలఁచినట్లు తెలియవచ్చినది. కావున మీచావు సమీపములో నున్నదనియే మీ యభిప్రాయమా !

వీరా:— ఇట్టి తరుణములు మాకుఁ బ్రతిదినమున లభింపవు. మఱియు, మనలో నెవరెప్పుడెక్కడఁ జనిపోవునది తెలిసికొనఁగలరు !

అగ్బ:— నిశ్చయము. ప్రతిమనుజుఁడు మరణమునకు సిద్ధముగఁ నుండదలఁచుట తెలివియైనపని.

పద్మ:— మేమీదుస్తులను ధరించినప్పుడే మరణమునకు సంసిద్ధులమై యుంటిమి.

అబు:— అవును. మీరట్లుంటిరని మిమ్ములను జూచుటతోనే నాకుఁ దోఁచెను.

వీరా:— ఈ సృష్టిలో మనము చూచునదంతయు మాయ. యథార్థము తెలిసికొనుటకు మన మశక్తులము.

అబు:— సృష్టిలో మనము చూచుపదార్థములనుబట్టి వస్తుతత్త్వ మెఱుఁగఁజాలమా ?

వీరా:— ఎఱుఁగఁజాలము. ఎన్నఁడు నిజమెఱుఁగఁ జాలము. ఒకవస్తువును మఱియొకవస్తువని భ్రమించి, మన తలఁపు నిక్కమేయని యూహించి తృప్తిఁజెందుదుము. మనము చూచు రూపమునకు వెనుక నింకొకరూపముండును.

అబు:— వాఙ్నిపుణత్వమునందుఁ గూడ మీరసమానులని తోఁచుచున్నది.

అగ్బ:—ఇంతకుముందు మీరు గుడారము వెలుపలఁ బాడు
చున్నప్పుడు మీ కంఠమాధుర్యమునుబట్టి స్త్రీలని నే
దలచితి.

అబు:—మీరు స్త్రీలై జన్మింప వలసినది.

వీరా:—అబలలమేయైన మీదర్శనమునకు వచ్చుటకు మేము
ప్రయత్నించియే యుండము.

అగ్బ:—

తే. గీ. మునివృషభులార! మీనుడు • ల్మధుమునుగూర్చె
మీమనస్సౌకృష్టభావము • ల్మెచ్చవచ్చు

వీరా:— దేవ తేమయసమానప్ర• భావగరిమ
మాకుఁ బ్రత్యక్షమైయుండ • నేకొఱంత?

భోజరాజును జూచిన వారికిఁ గవిత్వము వచ్చునట్లు, మీదర్శనభాగ్యమువలన మాకిట్టి తెలివి తేటలు పుట్టినవి.

(సిపాయి యొకజాబుతోఁ బ్రవేశించును. అబుల్ ఫజల్ దానిని జదివి సన్యాసులమొగముచూచి యగ్బరున కాలేఖ నిచ్చును. అతఁడును దానిని జదివి సన్యాసులమొగములవంక వీక్షించి, యబుల్ ఫజల్ వైపుఁ జూచుచు నవ్వును.)

అగ్బ:—(సిపాయితో) అబ్దుల్ ఖరీమును లోనికిరమ్మనుము.

(సిపాయి నిష్క్రమించును)

(సన్యాసు . లొకరిపై నొకరనుమానముతోఁ జూచుకొనిరి.)

అబ్దుల్ ఖరీము ప్రవేశించును.

(సన్యాసులు ఖరీమునుజూచినతోడనే కొంచెములికిపడిరి.)

అగ్బ:—(సన్యాసులతో) మీరీమనుజుని నిదివఱకుఁ జూచినట్లు కాన్పించుచున్నది. మీ కతనితో నెప్పు, డెక్కడ నెట్లు పరిచయము గల్గెను ?

వీరా:—

మ. జగతీనాటకరంగమందున మహా ♦ చాతుర్యవంతంబుగాఁ
బగలున్ రాత్రియునన్దెరల్వ్రాతిచియా♦ పై సూర్యచంద్రాదులన్
సొగసుందివ్వెలుగాఁగభూతతతులన్ ♦ జోద్యంపుఁ బాత్రాళిగాఁ
దగఁగావించుచుసూత్రధారపదమున్ ♦ దానొందివెల్గొందునా
భగవంతుం డదనంతలీలల మది ♦ న్భావింపఁగా శక్యమే ?

అట్టి యీ జగన్నాటక రంగమం దనేక పాత్రలు వచ్చుచుఁ బోవుచు నుండును. వా రేయే స్థలములందు నెప్పుడెట్లు కలిసికొనునది యెట్లు చెప్పఁగలరు ? దేవా ! ఇతనికిఁ బూర్వస్మృతి పూర్ణముగా నున్నదనుట నిక్కమైనఁ దమ ప్రశ్నమునకు సరియైనయుత్తరమీఁగలము.

అబ్దు:—నాకు బూర్వస్మృతి లేకపోలేదు. ఒకపని తగుటయుఁ దగకుంటయు మన మాచరించుటయందుఁ గాన్పించును. ఒకడేపని విధిగాఁ జేయవలెనో దానినే యొకప్పుడు విధిగాఁ బాడుచేయవలసివచ్చును.

(శిబిరము వెలుపల నొక ధ్వని వినఁబడును).

అబు:—సిపాయీ! ఆ ధ్వని యేమి?

(సిపాయి ప్రవేశించును).

సిపాయి:—తురక వేషము దాల్చిన రాజపుత్రుఁ డొకఁడు మన డేరా చుట్టు తిరుగుచు మన సిపాయిలచేఁ గనుఁగొనఁబడెను. వారతనిని బట్టుకొని తమ సెలవు కొఱకు వచ్చి యున్నారు.

అక్బ:—(అబుల్ ఫజల్‌తో) ఈ సాయంకాలము మనకు బాగుగాఁ గాలక్షేప మగుచున్నదే! (సిపాయితో) రాజపుత్రు నిటకుఁ దోడితెమ్ము. (ఇట్లు చెప్పుచు నక్బరు సన్న్యాసులవైపు చూచెను. వారు నొకరొకరివైపు చూచుకొనిరి.)

(ప్రతాపసింగుతో సిపాయి ప్రవేశించును.)

(ప్రతాపసింగును జూడఁగనే సన్న్యాసు లదిరిపడిరి. ప్రతాపసింగు ఖరీము లొకరివైపొకరు తేరిచూచుకొనిరి.)

అక్బ:—నీవెవ్వడవు? నీవు మాడేరాచుట్టుఁ దిరుగవలసిన పని యేమి?

అబు:—నీవు ఉదయసింగుని వేగులవారిలో నొకఁడవా? నీవు మీరాజుతో నడవులలోనే యుండినయెడల సురక్షితముగా నుందువుగదా?

ప్రతా:—రాజపుత్రుఁ డెన్నఁడు స్వలాభము కొఱకు మీగుడారము చుట్టుఁ దిరుగఁడు. ఆతఁడు తిరుగుచున్నంత కాలము మీకు సౌఖ్యమునుండ నేరదు.

తే. గీ. హైందవాటవిఁ జొరఁబడి ♦ యతిశయించి
మ్లేచ్ఛపుండరీక చయము ♦ స్వేచ్ఛతో వి
జృంభణమొనర్ప వానిని ♦ శిక్ష సేయు
కొఱకె రసపుత్రికేసరుల్ ♦ దిరుగుచుంద్రు.

అక్బ:—(సింగుతో) నీవీ సన్యాసుల నెఱుఁగుదువా ?
(అబుల్ ఫజల్ తో) మనకుఁదప్ప నితరుల కందరకీ సన్యాసులు పరిచయులే !

(సన్యాసు లొకరివై పొకరు చూచుకొందురు).

ప్రతా:—నేనక్బరుపాదుషా సేవకుఁడనుగాను. నేనతనికిఁ బ్రత్యక్షవిరోధిని. నాకు జవాబుచెప్ప నగత్యములేదు.

అక్బ:—ఇంకొకసంగతి నిన్నడిగెదను. నీవు సరియైన జవాబిచ్చిన యెడల బ్రతుకునం దాశగలిగి యుండవచ్చును. లేనిచో కొలది కాలములోనే నీవు కడతేరఁగలవు.

ప్రతా:—(చిఱునగవుతో) రాజపుత్రులెన్నఁడును మరణమున్న భయపడరు.

అబు:—రాజపుత్రుఁడు భార్యాపుత్రుల కొఱకైనను జీవితమునం దాశఁ గలిగి యుండఁడా ?

ప్రతా:—రాజపుత్రుఁడు మర్యాదనే వివాహముచేసికొనును. అతఁడు దేశక్షేమమునకే జీవించును.

అక్బ:—ఈప్రగల్భములు నికఁ గట్టిపెట్టుము. నీవిట్టిమాటలతో నీ సన్యాసుల కేదైన సహాయము చేయఁదలంచితివి

కాబోలు? అది సరియైన యూహగాదు. బాగుగ నాలోచించి చెప్పుము.

ప్రతా:—చెప్పుటకింక నాకేమి లేదు.

అక్బ—వారెవరో నాకుఁ దెలియదని తలంచుచున్నావా?

ప్రతా:—ఒక విషయమునుగుఱించి తెలియనివారెట్లుత్తర మీయలేరో, నట్లే తెలిసియున్న వారెవ్వరు నితరుల నడుగ లేరనుకున్నాను.

అక్బ:—నీకుఁ బ్రాణములయం దాశ లేకపోవుటచే నిట్లుసందర్భ ప్రలాపము లాడఁ జొచ్చితివి. (సిపాయితో) రాజద్రోహియైనట్టి వీనిని రేపుదయమునఁ జిత్తూరు రాజమార్గమున నురిఁదీయవలసినదని నాయాజ్ఞగా మన సేనాధిపతితోఁ జెప్పుము.

సిపాయి:—చిత్తము. అట్లే రోయునర్చెదను. (అని చెప్పుచుఁ బ్రతాపసింగుతో నిష్క్రమించును.)

(సన్యాసులిరువురునుదమ్మురక్షింపఁదలఁచుకొన్న ప్రతాపసింగును జంపెదరను భయముచే నొకరినొకరు చూచుకొని మోకరించిరి)

వీరా:—ఓ ఢిల్లీ చక్రవర్తీ! న్యాయమూర్తివనియు దయాశీలుండవనియు దేశమునందంతటను ఘనతకెక్కిన యో యగ్బరుపాదుషా! మేమిరువురమే యుత్తరవాదులమైన యీ

నేరముగాఁ డా రాజపుత్త్రి నురిఁదీయించుట మీ ఘనత కుఁదగినపని కాదు.

అగ్బ:—అట్లయిన మీరెవ్వరో యథార్థము వచింపుడు.

వీరా } తమసన్న్యాసి వేషములనుదీసివేసి యథాస్వరూపము
పద్మిని } లతో నిలుతురు.

వీరా:—తమరు యథార్థమును దెలిసికొనఁగోరుటచే మా సత్య స్థితిని వినిపించుచుంటిని. నేను చిత్తూరు మహారాణావారి పట్టమహిషిని. ఈమె వారి సహోదరియగు పద్మినీబాయి. మీరు చిత్తూరుదుర్గమును ముట్టడింతురని మా రాణావారు విని సిగ్గింతమాత్రమును లేక, యుద్ధమన్న వెఱచి, ప్రసిద్ధికెక్కిన రాజపుత్త్రివంశమున కపకీర్తి గలుగునట్లుగా నడవులలోనికిఁ బాఱిపోయిరి. అప్పుడు స్త్రీలమయ్యు యుద్ధశాస్త్రమేమియు నభ్యసింపనివారమయ్యు పురుషవేషములఁ దాల్చి యాచిన్న రాజపుత్త్రిసేనతో మిమ్ములఁ నెదుర్కొంటిమి. మేము మిమ్మెదుర్కొనుట గొప్పపర్వతమును వర్షపుఁజినుకులచే భేదింపనెంచుటవంటిదే! మా సేన నాశమయ్యెను. మేమపజయముఁనొందితిమి. మా దేశము శత్రువుల పాలయ్యెను. మా యాశ లడుగంటినవి. మా యాత్మ గౌరవముకూడ నశించినది. ఇట్టికష్టములకు మమ్ములోను జేసినట్టి యా శత్రువుమీఁదఁ బగఁ దీర్చుకొనఁదలంచితిమి. వేయేల?

మిమ్ములనుజూచి యెట్లయినను బరిమార్చి మేమాత్మ హత్యఁగావించుకొనవలయుననినిశ్చయము చేసికొంటిమి. మేము తలఁచుకొన్న రీతిఁగా మీగుడారములోనికిఁబ్రవేశింపఁగలిగితిమి. మీ సమ్ముఖమునకు వచ్చిన నిముసముననే దయారసపూరితమగు మీ ముఖవైఖరినిజూచి మా దురభిప్రాయములను దెలిసికొంటిమి. మావల్లఁ బ్రాణరక్షణము నొందినట్టి యీయబ్దుల్ ఖరీమ్ మాకపకారము చేయఁడని తేఁచియుంటిమి. అట్లుకాకయితడు మాయెడలఁ గృతఘ్నుఁడై మాగుట్టు బయలుపెట్టెను. మమ్ములను మీయిచ్చానుసారము దండింపుఁడు. మరణదండనమున కాజ్ఞాపింపుఁడు. కాని మాకొఱకుఁ దన ప్రాణములను గోల్పోవ సంసిద్ధుఁడైనట్టి నిర్దోషియైన యీ రాజపుత్త్రుని రక్షింపుఁడు. ఓదయామయా! ఇదియే మా ప్రార్థన.

అక్బ:— ఓసాధ్వీమణులారా! లెండు. మీబోటిఘనమైన పరాక్రమము గలవారిట్లు మోకరించుట తగిన పనికాదు. మీ రసపుత్ర శౌర్యమునకును, గౌరవమునకును, దేశభక్తికిని, సత్య సంధతకును, మెచ్చి యీ రాజపుత్త్రుని రక్షించితిని. రాజభక్తిగల యీ యబ్దుల్ కరీంమీఁద మీరు మోపిన యపవాదము సరియైనదికాదు. అతఁడు మీచరిత్ర మంతయుఁ బూర్తిగా

వ్రాసినమాట నిజమే. కాని మిమ్ములను రక్షింపుమని యుత్తరము కోరినసంగతి యీజాబును జూచినయెడల మీకువిశదమగును. ఇతఁడట్టి కృతఘ్నుఁడైయైన నింతఁ శ్రమఁ దీసికొనియుండఁడు. మీకంఠధ్వని వినఁగానే నా కనుమానము గలిగెను. తరువాత స్త్రీలకు సహజమగు సిగ్గుగల మీముఖములనుజూచి నాభ్రాంతి నిశ్చయమైనట్లు తలఁచితిని. మీప్రత్యుత్తరములు నాయభిప్రాయమును దృఢపఱిచినవి. నాకిదివఱకుఁ దెలియనిదియు, అబ్దుల్ కరీమ్ వ్రాసినదియు, సేమన, నడవులకుఁ బాఱిపోయిన పితికిపందయగు నుదయసింగురాణాకు మీ కెట్టి సంబంధముగలవారో యనువిషయ మొక్కటియే.

వీర్బా:—పురుషవేషముదాల్చినను స్త్రీస్వభావముదాఁగనేరదు.

అబు:—అదిమీస్వభావ లోపముగాదు. స్త్రీజనస్వాభావికమగు సల్లక్షణము.

అగ్బ:—ఓరాణులారా! నేను మీ కేమైన సాహాయ్యముఁ జేయఁగలనా!

వృద్ధిని:—మమ్ములను మాయవమానమును గూడ శీఘ్రముగ సంహరింపుఁడు.

అక్బ:—అట్టిమాటల్ల నాడకుఁడు. మీ రెందులకు మృత్యువును గోరవలెను?

పీరా:—చిత్తూరుపురమందలి రాణివాసస్త్రీలిరువురు మారువేష ముతో మొగలాయి శిబిరముఁ జొచ్చినట్లును, పాదుషా వలనఁ బట్టుకోఁబడినట్లును, రేపటినుండి ప్రపంచమందం తటను జెప్పుకొనెదరు. అట్టి యవమానమును మేము సహించుటెట్లు ? మాకిఁక మరణమేశరణము.

అక్బ:—నేను దానినంగీకరింపనిచో ?

పీరా:—అట్లయిన మాకోరికి మీరుసిరాకరించినవారగుదురు.

అక్బ:—(ఫజల్‌తో) వారినిశ్చయబుద్ధికి నీయభిప్రాయమేమి ?

అబు:—మీ దేశపుస్త్రీలందఱు మీవలెనే దృఢబుద్ధియు, ధైర్య సాహసములును గలిగినట్టివారా ?

పీరా:—కారు. నిశ్చయముగా మావంటి పిఱికివారుండరు. వా రందరు మాకంటె వేయిమడుంగు లెక్కువ పట్టుదలగల వారు. వారిలో నొక్కరైన నిట్టి యవమానము పొంది యొకనిమిషమైన జీవింపఁగలరా ?

అక్బ:—ఇట్టి ఘనకార్యము నవమానకృత్యమని తలంచుట భా వ్యము కాదు. మీరడిగినట్లు నిచ్చుటకు సంసిద్ధుఁడనై యుంటిని. అడుగుఁడు.

పద్మిని:—మేమెన్నఁడు నితరుల యాచించియుండ లేదు.

అక్బ:—మీరడుగకున్నను మీరాజ్యమును మరలమీకిచ్చితిని. (పీరాబాయితో) రేపుదయమున రాజ్ఞీగౌరవముతో

మీరిరువురును మీపురమున కరిగినపిమ్మట, నీభర్తసిం
హాసనమున నీవలంకరింతువుగాక.

మీరా:—అట్టినిబంధనలతోఁ గూడిన రాజ్యమును నేనెట్లుస్వీక
రింపఁగలను ?

అగ్ని:— ఆఁడువారగు మిమ్ములను సంతోషపెట్టుట నాకుసులభ
సాధ్యముకాదు. కాని మిమ్ముల నెట్లయిన సంతోష
పెట్టవలెనని నిశ్చయించుకొంటిని. నిబంధనలేమియు లే
కుండఁగనే మీరాజ్యమును మీరుస్వీకరింపుఁడు.

మీరా:—ఇట్టిఘనదాతృత్వము ప్రపంచమునందెన్నఁడైనఁగలదా !

పద్మిని:—

ఆ. వె. మాకృతజ్ఞతవలె ♦ భూమినాథ మీకీర్తి
శాశ్వతముగ భువిని ♦ సాగుఁగాత !

మీరా:— ప్రబలమైత్రిఁజెంది ♦ రసపుత్రయవను లీ
భరతఖండమేలి ♦ వరలుగాత !

ఎట్టికష్టములువచ్చినను, ఎట్టి యాటంకములు వచ్చినను
వెనుదీయక తాము ప్రారంభించిన కార్యమును గొనసాగించు
వారేగదా ధన్యులు.!

(తెరపడును.)

# అసామాన్య

ఇందువచ్చు పాత్రములు.

అసామాన్య:—కథానాయిక, మతిచ్ఛందునికూఁతురు.
సుగుణాకరుఁడు:—అసామాన్యభర్త, ధార్మికుఁడనువానికొడుకు.
మతిచ్ఛందుఁడు—జగత్సేటువంశమునఁబుట్టిన యొకధనికుఁడు.
ధారుణీదేవి—అసామాన్యతల్లి.
అరవిందు, మల్లిక—అసామాన్య చెలికత్తెలు.
సురాజుద్దౌలా—ముర్షిదాబాదు నవాబు.
మెహర్నిణా బేగమ్=లల్ అనునామాంతరముగల సురాజుభార్య.
పడవవాండ్రు, చేటికలు, భటులు—కొందఱు.

కథాసంగ్రహము:—క్రీ॥ శ॥ 1750-వ సంవత్సరప్రాంతమున బంగాళాదేశమును సురాజుద్దౌలాయను నవాబు ఢిల్లీచక్రవర్తికి లోఁబడి పరిపాలించుచుండెను. అతఁడు ముర్షిదాబాదు ముఖ్యపట్టణముగాఁ జేసికొని యుండెను. అతఁడు చిన్ననాఁటి నుండియు మిగుల గారాబముతోఁ బెంపఁబడుటచే దుష్టస్నేహితులసహవాసముచేసి దుర్వర్తనపరుఁడయ్యెను. అతఁడు సింహాసనమధిష్ఠించినది మొదలు పెక్కు దుష్కార్యములాచరించెను. వీధిలో నేయందఁగత్తెకన్పట్టినను బలాత్కారముగా భటులచే దనకడకుఁ దెప్పించుకొని యనుభవించు చుండెను. అదిగాక యతఁడు సురాపానము ద్యూతము మున్నగు వ్యసనములకుఁ

గూడ నలవడి మత్తుఁడై యుండెడివాఁడు. అతనికాలములోఁ దండ్రి, యన్న, భర్త మొదలగు వారు చూచుచుండఁగనే బిడ్డ, చెల్లెలు, భార్య మున్నగువారి కత్యంత మానహాని సంభవించుచుండెను. అట్టితఱి నాగ్రామమున మత్తబ్బందను గొప్ప ధనవంతుఁడు కాఁపురము చేయుచుండెను. అతనికిఁ జక్కని చుక్కయగు నసామాన్యయను కూఁతురుగలదు. సురాజునకుఁ దఱుచుగా నప్పుకావలసి యీమత్తబ్బందునికడకు వచ్చువాడుక కలదు. మత్తబ్బందనిన సురాజుకూడ భయపడువాఁడు. కాని వాఁడొకతఱి నసామాన్య యందమునుగూర్చి విని యామె పెండ్లియాడినవనిత యనియైన శంకింపక యెట్లైన నామెను బడయవలెనని నిశ్చయించుకొని మత్తబ్బందింట లేని సమయమున స్త్రీవేషమున నాతని భవనమునకువచ్చి యామె మానముఁ జెఱుపఁజూచెను. కాని యామెభర్త సుగుణాకరుఁడు చెప్పుదెబ్బలతో బుద్ధిఁజెప్పి రాజని కరుణించి వానిని విడిచిపుచ్చెను. తరువాత నొకనాఁడు సురాజు సుగుణాకరుల తలఁదీయించి దానినొక పళ్లెరమందుఁబెట్టి యసామాన్యకుఁ గానుకగా బంపెను. ఆమె మిగుల శోకించి భర్తపైఁగల యనురాగముచే మతిచెడిన దయ్యెను.* ఆమెపిచ్చి కెన్నిమందులిచ్చినఁ గుదురలేదు. ఇట్లుండ సురాజునకు శత్రువులెక్కువయై యాతనిపైఁ గుట్రలుపన్నిరి. అతని బంధువులే యతనికిఁ బ్రబలవిరోధులైరి. వా రింగ్లీషువారి సాయమున నాతనిని 1757-వ సంవత్సరమునఁ ప్లాసీయుద్ధమున నోడించిరి. పిమ్మట మీరాన్ అనువాడతని

శిరచ్ఛేదముం జేసెను. ఆశిరము యొక్క బల్లెమునకుఁ గ్రుచ్చఁబడి యూరేఁగింపఁబడెను. అసామాన్య కాశిరస్సును జూపిన వెఱ్ఱి కుదురునని తలఁచి యామె బందుగు లామె నొక మేడకుఁ దీసుకవచ్చి యాశిరముంజూపఁగాఁ నామె "ఈతలయెవరిది? పాప మీతని భార్య యెంత నిర్భాగ్యురాలు!" అని క్రమముగాఁ దెలివొంది నానాఁటికి స్వస్థతఁ జెందెను. అటుతరువాతఁ దాను గావింపవలసిన పని భగవంతుఁడే చేసెననియు, భగవంతునిపనియొకటి తాను జేయవలసియుండె ననియు నామె యనుచుండెను. దాని యర్థ మెవ్వరికిఁ దెలియలేదు. నవాబుభార్య గుల్ స్త్రీ శిశువునుగని ప్రాణభీతిచే నెచ్చటనో డాఁగియుండెననియు, నామె మిగులగుణవతియనియు విని యెట్లైన నామెను బిడ్డను రక్షింప నసామాన్య నిశ్చయించుకొనెను. ఆగుల్ బాగాబంగోలాయను గ్రామములో నున్నదనివిని యచ్చటకు నసామాన్య వెళ్ళెను. కాని శత్రువులెవరో తన కొఱకు తఱుముకొని వచ్చుచున్నారని విని భయపడి బిడ్డనెత్తుకొని గుల్ పాఱిపోయెను. ముందు గుల్, వెనుక నసామాన్య గ్రామగ్రామములఁ దిరుగఁజొచ్చిరి. కాని దైవఘటనచే నొకరినొకరు కలిసికొనలేకపోయిరి. తుదకొకపర్యాయము కూఁత వేటుదూరమున గుల్ గలదని చూచి యసామాన్య పఱుగెత్తెను. ఇంకఁ దన బిడ్డ ప్రాణములు దక్కవని వెఱచి గుల్ గంగానదియొడ్డునకుఁ బఱుగెత్తెను. అసామాన్య తాను శత్రువును గానని కేకలువైచెను. కాని యప్పుడు తుపానుగాలి యుండుటచే నామాటలా గుల్ చెవిని బడవయ్యె. తుదకు

గుల్ నావవాంఁడచేతిలో నొక వజ్రింపుటుంగరము బెట్టియొక పడవలోఁబడి నదిదాటఁ జూచెను. కాని యా పడవ గాలిచే మునిఁగిపోయి యందున్నున్న గుల్‌బిడ్డలో నేటిలోఁబడి పోయెను. అసామాన్య యంతయుఁజూచి నదిలోనికుఱికి యీఁది జడబట్టుకొని గుల్‌నిపైకిఁదీసెను. అప్పటికే గుల్ ప్రాణములు విడిచెను. ఆమె బిడ్డ మాత్రము వెన్నునకుఁగట్టఁబడి సజీవయై యుండెను. అసామాన్య యామెను దన పుత్రికగాఁ బెంచుకొనెను. ఇందసామాన్య గుల్బేగముల సుగుణసంపత్తి యతిశ్లాఘ్యమైనది. వారి నామము లాచంద్రతారార్కముగా భువిని నిలుచును.

---

## ప్రథమ రంగము.

రంగము:—మతబ్బందుని భవనము ముందరనుండు రాజమార్గము.

ప్రవేశము:—స్త్రీవేషధారియగు సురాజుద్దౌలా.

సురాజుద్దౌలా:—ఇదేకదా మతబ్బందు జగత్సేటునిగృహము? అదేమికారణమో తెలియదు; లోనికిఁ బోవుదమన్న నడుగులు తడఁబడుచున్నవి. యౌవనారంభమైనదాది నేటివఱకెందఱు సుందరాంగుల పొందొ పొందియుంటిని! కాంతులకడనుండి విడిపించి యెందఱెందఱినో నాకడకు రప్పించుకొంటిని. జననీజనకులు మొఱలువెట్టిన

వినక నవయౌవనవతులగు నారీమణుల నెందఱినో హరియించితిని. కన్నబిడ్డలను లాలించుచు నంతఃపురవిహారము చేయు తరుణుల నెందఱినో బిడ్డలనుండి వేరుచేసితిని. కాని యాయా సమయములయం దెప్పుడును భీతిఁ జెంది యెఱుఁగను. ఆఘోరకృత్యము లన్నియు నిశ్శంకముగా నిరాఘాటముగా నెఱవఁగల్గితిని. ఇప్పుడేల యిట్టి వెఱపుగదురుచుండెనో బోధపడకున్నయది.

ఉ. క్రూరవిపత్తుపంచనఖ ♦ కోటుల వ్రేల్మిడిఁ గాలమందిర
ద్వారములోని కంపఁగల ♦ బాహుబలాన్విత సింహరాజమే
ధీరతఁ గోలుపోయి యొక ♦ దీనకురంగిగృహాంగణంబునం
జేరఁగ భీతినొందుట విచిత్రముగాదె విధాతసృష్టిలోన్.

ఇంతకు మత్ప్రాంతధనికులలో నగ్రగణ్యుఁడై జనులకిష్టుఁడౌటచేఁగదా నేనిటుభయపడ వలసివచ్చెను. నేనిప్పుడు బలాత్కారముచేసి యీ లావణ్యనిధానమును గొనిపోయితినేని వానికిఁ గోపమువచ్చి నాపైఁ గుట్రలుపన్నును, హుమ్— వానికుట్రలు నన్నేమిచేయఁగలవు? నేనుదలఁప వానిని హత్యమొనర్చుటెంత? (కొంచెము సేపాలోచించి) కీడునుశంకించి యికార్యాచరణమునకు మదియెంత వెనుకకు లాగుచున్నదో, మోహము నన్ను బురస్కరించుకొని యంతకంటె నెక్కువగా నదిముందునకు నెట్టుచున్నది. ఆనాతినిగూర్చి విన్నదిమొదలు నాడెందమ్మామెయందు లగ్నమయినది.

మ. "వనితారత్నపు సోయగంబు సఖుఁడా ♦ వర్ణింపశక్యంబె? నీ
కనుభావ్యంబనఁజాలు; దానిచెలిమిన్ ♦ హర్షించుపుణ్యుం డెభూ
మినిధన్యుం"డనుచెల్మికానిపలుకుల్ ♦ మిథ్యాప్రయుక్తంబులై
చనునే? కావు;కృతార్థతన్‌బడసెదన్ ♦ సాధించి నాకార్యమున్.

నేనీస్త్రీవేషమునుండ నన్నెవ్వరానవాలుపట్టఁజాలరు. నా రూపమచ్చముగ నాఁడుదానివలె నున్నను, నడకయు నడతయు మఱియొకలాగుండునేమో! వానియందును నాయోపినంతవట్టు స్త్రీత్వము నటించెదను. నేనొక రాజపుత్రికాంత ననియు నసామాన్యాదేవి సుగుణసంపత్తియు విద్యాసక్తియు వినివచ్చినాననియుఁ జెప్పినమ్మకముంబుట్టించి వినయముఁగనఁబరచి మాఁబసకొక తూరి రమ్మని ప్రార్థించి తీసికొనిపోయెద. నా కల్లమనవులకు బొల్లివినయములకు నామెలోఁబడి నావలలోఁబడిన నేనదృష్టవంతుడనే. నాకృషికి భగవంతుఁడుకూడఁ దోడు కావలయు. కాకపోఁడని నాధైర్యము. (అని మతొబ్బుంచు భవనముంజొచ్చి కక్ష్యాంతరములుదాఁటి కావలివాండ్రవలన నసామాన్యయగారమును దెలిసికొని దానిలోఁ బ్రవేశించెను. అసామాన్య సన్నిని మనోహరమైన కంఠధ్వనితో సంస్కృత భారతములోని ద్రౌపదీ వస్త్రాపహరణ వృత్తాంతము జదువుచుండెను. పురాజామె సోయగముంజూచి యచ్చెరువొంది చిత్తరువు వగిది నిలిచెను.)

సురాజా:—(ఆమెవంకఁజూచి) అహా! ఏమి యీయామె సౌందర్యము! నేనుబుట్టి బుద్ధియెఱింగి యెందఱినో వన్నెలాఁడులం గాంచితిని. గాని యీయన్నులమిన్నం బోలుదాని నెన్నఁడుం గనలేదు.

చ॥ కనకపుబొమ్మయో యనవి • కాసమువీఱితనర్చు మేను; నుస్వనము విపంచి కారవము • భాతి మనోహరగాన మీనుచుందనరు; ముఖంబు శాంతరస • ధారలఁ గ్రిక్కుచుశోభఁ గాంచు; నెమ్మనముగలంగు నిట్టియఖి • మానవతీమణి డాయఁ బోవఁగన్

హృదయమా! వేగిరపడకుము. నీవదృష్టవంతురాలవేని నీయీప్సిత మచిరకాలముననే తీఱును. (అని యామె సమీపమునకేఁగి) దేవీ! నమస్కారము.

అసా:—(ఉలికిపడి పుస్తకము హస్తమునుండి జాఱవిడిచి లేచి) అమ్మా! మీరెవరు? ఇచ్చటి కెందులకై తెంచితిరి? ఆయాసనమున నాసీనలు కండు.

సురా:—(ఆసీనుఁడై) దేవీ! నేనొక రాజకన్యను. మాది రోధపురము. ఈయూర మాకు బంధువులుగలరు. ఈ పట్టణవిశేషము లేమని మాచుట్టాలనడుగఁగా వారుమీసౌజన్య సౌందర్యాతిశయములంగూర్చి పెద్దగావచించిరి. నేను మరల మానగరమునకు రెండుదినములలోఁ బోవనుంటిని. ఈలోపున మీదర్శన మొనర్చి మీసాంగత్యభాగ్య మొంది ధన్యనుగాఁగోరి యిందుల కరుదెంచితిని. (అని తేఱి చూచును).

అనా:—(ఆమె చూపులయందు యాథార్థ్యముపొడచూపమి ననుమానపడుచుఁ గొంతసేపూరకుండి పిమ్మట) అమ్మా! నాకడఁ గొనియాడ దగిన సౌజన్య మేమియు లేదు. ఎవరో నామీఁద నవ్యాజవాత్సల్యము వహించి మీతో నట్లు వచించియుందురు. ఈమహాపట్టణంబున నన్ను మించిన సుందరులును సుగుణవతులును గలరు. వారల సందర్శించి యానందింపుఁడు. నాకెందునుం గౌశలము లేదు.

సురా:— దేవీ! అట్లనదరేల ? వీణానిక్వాణతుల్యమగు మీకంఠస్వరము నేను వినలేదా ! మీరుచక్కఁగా భారతముం జదువుచుండ నాకు ముచ్చటయ్యెడి. మరల రెండుశ్లోకములను జదువుఁడు.

అనా:—(సిగ్గుపడి) అమ్మా! నేను మాయమ్మకడనైనఁ జదువలేను. ఒంటరిగ నున్నప్పుడుతప్ప నెప్పుడును జదువను. నా యసమర్థతకు క్షమింపుఁడు.

సురా:—పోనిండు. మీదివ్య గృహమంతయు నాకుఁ జూపింపుఁడు. మీశయనాగారము మున్నగువానిఁ దిలకించి మీతోఁ గొన్నిపవిత్రనిమిషములు ప్రసంగించి వెడలెదను.

అనా:—సరే. రండు. (అని గృహమంతయుఁ ద్రిప్పిచూపును. తుదకుఁ దాను బవ్వళించు గృహమునకుం గొంపోయి

యొక కురిచీమీఁదఁ గూర్చుండ నియమించి తాను నొకయాసనముపయిం గూర్చుండును.)

సురా:—దేవీ! నేను నిక్కముగా ధన్యురాలనైతిని. నేఁడు నాజీవితకాలములోఁ గను సుదినము. అడుగమఱచితిని; మీభర్తగారు యూరనుంటిరా? వారు మీకెపుడు కుశలులే యనుకొందును?

అసా:—వారిచ్చట నేయున్నారు. వారు నాప్రాణమునకుఁ బ్రాణమే.

సురా:—ఈ యూరిరాజుగారి నెప్పుడైనఁ జూచితిరా మీరు?

అసా:—లేదు. ఆతఁడు కడుదుష్టుఁడని విందును. దుష్టులఁ జూడనేల?

సురా:—దేవీ! అది వట్టిమాట. అతఁడు మిక్కిలిమంచివాఁడు. మాబంధువులయింటఁ బెండ్లి జరుగుచుండఁ దాంబూలము నకుఁవచ్చినప్పు డాతని నేఁ జూచితిని. ఆతఁ డెంతటిసుందరాంగుఁడో యంతటి సుగుణ సంపత్తిగలవాఁడనినాకుఁ దోచినది. ఆతని జూచినతోడనే 'యెంతపుణ్యవతి యీతనిఁ జేపట్టినసతి' యని తలంచితిని.

అసా:—కావచ్చును. ఇప్పు డాతనిప్రశంస మనకేలా?

సురా:—ఎందుకుఁగాదు. అట్టిసురూపసుగుణ శోభితుఁడగు రాజుచేఁ బరిపాలింపఁబడు నీపురీయు లెంతయో యదృష్టవంతులుగదాయని తెల్పుటకే యట్లంటిని. అమ్మా!

మీరొకపరి మాబంధు గృహమునకు విజయము చేసి దానిని బావనముంజేయరా ! దాన నాకత్యంతానందము గల్గును. జన్మము తరించినదని భావింతును.

అసా:—అమ్మా ! నేనెప్పుడు నొరులయిండ్లకరిగియెఱుంగ. ఇప్పుడు వెళ్ళుదమన్నను, నాభర్త యనుమతిం గైకొని నంగాని రాఁగలనో రాలేనో తెలుపఁ జాలను.

సురా:—(మనసునిలుపఁజాలక) సుందరీ! నిమ్ముజూచిన నావంటివాఁడుదానికే మోహ ముదయించుచున్నది. ఇఁకేఁ బురుషులమాట చెప్పవలెనా ? (అని మెల్లఁగాఁ గురిచీ సమీపమునకు లాగుకొని యసామాన్య కరముం బట్టును.)

అసా:—(తనలో) ఏమిది! ఈతాకుడు స్త్రీస్వభావమునకు విరుద్ధముగనున్న దే ! ఈమెకంఠస్వరము నడక పుంస్త్వమును స్ఫురింపఁజేయుచున్నవి. ఇది యేదో మోసము కాదు గద ! (అని చేయివిదలించుకొనును.)

సురా:—(మరలఁ గరగ్రహణముంబొనర్చి) యువతీ ! ఏమో చెప్పఁజాల. నీయందు నాడెందము లగ్నమయ్యె. నీమగఁడనుమతించిన ననుమతింపకున్న నీవు నా వెంట రావలయు. లేకున్న నాయుసురులు నిలువవు.

అసా:—(మరలవిదల్చుకొని) అమ్మా ! మీనుడులు నాకర్థమగుట లేదు.

సురా:—(స్త్రీపంజాలక). చానా! అర్థమో యనర్థమో నాకుఁ దెలియదు. నీవు నాతో రాకతప్పదు. (అని బలాత్కారముగా జేయిపట్టి లాగబోయెను. అసామాన్య భీతిల్లి కేకలువైచి పాఱిపోవఁజూచెను. కాని సురాజు గట్టిగాఁ జేయిపట్టుకొని యాపెను. ఆ కేకలువిని దాసీజనముతో నసామాన్యభర్త సుగుణాకరుఁడు ప్రవేశించెను.)

సుగు:—ఓయీ! స్త్రీవేషధారివగు నీవెవఁడవు. వదలు మామె చేయి. (అని సురాజుపట్టు బలవంతముగాఁ బట్టిలాగెను. ముఖముమఱకఁ జూచెను. సురాజనిపోల్చెను.) (క్రోధముతో) ఓరీ! యంతఃపురద్రోహీ! నీవటరా! మంచివాఁడో యనుకొంటిని. ఎప్పుడిట్టి పనిచేయకుండఁ దగినరీతి బుద్ధిఁజెప్పెదనుండుము.

చ. ఇదివఱకీవుచేసిన య♦నేకమహాదురితంపుఁగృత్యముల్
మదిఁదలపోయకుండుటను ♦ మాటికిదుండగముల్ యొనర్చెదు
ర్మదమున రేఁగుచుంటి; వికఁ ♦ రాజనిగౌరవముంపరాదు నె
మ్మదిఁబడయంగఁగోరఁదగు♦మాడ్కినిబుద్ధినిజెప్పుటొప్పగుఁ.

(అని పాదరక్షలతో నాల్గుప్రహారములు వడ్డించి బంట్లచే దేవిడి దాఁటువఱకు సాగనంపించును. సురాజు తలవంచుకొని నడచిపోవును.)                    (అందఱు నిష్క్రమింతురు.)

---

## ద్వితీయరంగము.

రంగము:—సురాజునంతఃపురప్రాంగణము.

ప్రవేశము:—సురాజునిర్విణ్ణుఁడై.

సురాజు:—ఆహా! ఎంతపరాభవముం జెందితిని! ఎచ్చటనైనఁ దాఁటుకొని రాఁగల్గితినిఁగాని మతెచ్చుందునింట నాయాటలు సాగినవికావు. ఇంతకు నాదినములు మంచివికావు (ఆలోచించి) అయ్యో! మంచివి కావననేల? కానిచో నాసుగుణాకర హతకుఁడు నన్నుఁ బరిమార్చియే యుండును. నేనీపాటికి యమమందిరమునఁ బ్రేతగాఁపునై యుండియుందును. నాదినములు మంచివే. నన్నుఁబరిభవించిన వానిపైఁ బగఁదీర్చుకొనుటకు నాకుభగవంతుఁడవకాశ మిచ్చినప్పుడు నాకు శుభదినములు కాకుండునా? (పండ్లు పటపటకొఱుకుచు) ఓరీ! నీచా! పాదరక్షలతో నన్నుఁగొట్టుటకు నీవెంతవాఁడవు? నాకాలిక్రింద బొక్కు క్రిమికన్న నధమాధముఁడవే! కానిమ్ము. నీదినములు సమీపించినవి.

సీ. ఓరిసుగుణాకరహతకా! • యుద్ధతివిడు,
మచిరకాలంబునన మదీ • యప్రాదయజని
తామితక్రోధకాలదా • వాగ్నితప్త
శలభమాత్రుఁగాఁ జేసి ని • న్మలపివైతు.

(తలవంకించి యోచించుచు రాజమార్గమువైపు చూచుచుండును. సుగుణాకరుఁ డశ్వారూఢుఁడై యాదారినే వావా

లికిఁ బోవుచుండును. సురా: జులికిపడి (తత్తఱపాటుతో) ఓరీ!
భటులారా! శీఘ్రముగాఁబోయి యాయాశ్వికు నిటకుఁ దోడి
తెండు. మీకుఁ గొప్ప బహుమానమిత్తును. పొండు. (తనలో)
దుష్టా! దొరకితిరా! ఎందుఁబోగలవు? సాలెపురుగు పట్టులోఁ
బడిన యీఁగవైతివి. ఇఁక నా కసిదీఱ నిన్నుఁజిత్రవధఁగావించి
క్రీడింతును.

ప్రవేశము—సుగుణాకరునితో భటులు.

సుగుణా:—ఏమిరా! తుచ్ఛుఁడా! ఇట్టి దొంగపని చేసితివి?
నీది నిజముగా దొంగబ్రతుకే యగురా! నీకుఁ బౌరుష
మున్న నాతోఁబోరుము. ఆఁడుదానవేని యాఁడుదాని
పనిచేయుము.

సురా:—ఓరీ! వెఱ్ఱిలకు. సింహంపుగుహలోఁజొచ్చిన సృగాల
మవయ్య నింకను బ్రగల్భములే? నాఁడు విజృంభించి
నాయంతవానిపైఁ బడితివే! ఆమగతన మేమయ్యెను?
పాపము సామాన్య రేపటినుండి బాలవిధవా సమూహము
లోఁజేరును గాఁబోలు! కాదు. కాదు. అట్లవనేల?
ఆమెకు నూతనధవుఁడను నేనుంటిఁగదా! ఆమె సదా
సధవయే.

సుగుణా:—ఓరీ! పాపీ! నేను జచ్చిన పిమ్మట నాభార్య నీకుఁ
దక్కఁగనుకొంటివిరా? నీవు నీకుటుంబమునకు నీకోటకు
జిచ్చుపెట్టి తాను జిచ్చుంబుచున్నావు. (నీకు వినాశకాలము
సమీపించి పట్టియే యిట్టి విపరీతబుద్ధులు పుట్టుచున్నవి

(ఊర్ధ్వదృష్టితో) ఓపరమేశ్వరా! నీయాజ్ఞయగుటచే నీదుష్టునిచే వధింపఁబడి నీసన్నిధానమునకు వచ్చుచుంటిని. నీవు కరుణాళుఁడవై యచిరకాలముననే యీచండాలునిఁ బరిమార్చి భూమి నిష్కంటకముగాఁ జేసి నీ గారాబుతనయుల మానమును గాపాడికొనుము.

సురా:—నీవెఱ్ఱిప్రార్థనలు గట్టిపెట్టుము. దేవుడు నీవిచ్చికోర్కులు తీర్చు వాఁడుకాఁడు. నిన్నువేగమ నరకమునకుఁ బొమ్మనుచున్నాఁడు. ఓరీ! భటులారా! వీనిని నానా హింసలఁబెట్టి తలఁదీసి యాతల నాకు నుపాయనముగాఁ గొనిరండు.

సుగుణా:—ఓరీ! సురాపానమత్తా! నీతిగల యేహైందవుఁడును జావనభయపడడు. నేనీరీతి జంపబడుటచే నాకీర్తి హెచ్చును. నీకపకీర్తిగల్గును. దొంగపోటున శాత్రవులఁ జంపుట మాహిందువులెఱుఁగరు. ఎఱిఁగిననాఁడు నిన్నుఁ గాలునిపురికిఁ బంపియేయుందుము. నేఁడిట్లు నన్ను జంపుచున్నావు; రేపుఁ నీవింతకన్న ఘోరమగు మరణముంబొంది క్లేశపడఁగలవు. ఇల్లలికినంతనే పండువు కాలేదు.

చ. నేనేధార్మికు నాత్మసంభవుఁడనేఁ • నిష్ఠాగరిష్ఠుండనై
ధేనుబ్రాహ్మణభక్తియుక్తుఁడనై • దేవాలిఁబూజింతునేఁ

నానారీమణి సాధ్వియైవఱలు నేఁ • నన్నొంచునీపాపి తా
మానప్రాణములందొఱంగి మఱియుఁ • యూనంబులో దీనుఁడై
(సుగుణాకరుఁడు హరిహరీయనుచుండ భటులు గెంటుకొనిపోవుదురు.)

---

## తృతీయరంగము.

రంగము:—అసామాన్యపడకటిల్లు.

ప్రవేశము:— అసామాన్యయు నిద్దరుచెలికత్తెలు.

అసా:—చెలీ! అరవిందా! నానాథుఁడు వాహ్యాళికై వెడలి యింకనురాలేదు. రాత్రిజాము మీఱుచున్నది. భుజించువేళ దాఁటిపోయినది. మామాన్నగారు రారలేరు. వారున్న నీపాటికెవరినైనఁబంపి వెదకించి దీసికొని వచ్చియుందురు. (ఇంచుకయులికిపడి) ఇదేమో నాకుడికన్నదరుచున్నది. నాకుస్వప్నాదుల యందంత నమ్మకము లేకపోయినను మదికీడును శంకించుచున్నది. నాప్రాణనాథుఁడెన్నఁడింతతడసియుండలేదు. గ్రామాంతర మేగునేని మున్ముందు నాతోఁ జెప్పకపోయియుండలేదు. అదిగాక నేఁడు నాతో "ప్రియా! నదిరొడ్డున కళ్యాణనాథుఁడనైనయవ్యాళికై పోయివచ్చెద. నీవిందాఁక భారతములో నభిమన్యుఁడు పద్మవ్యూహముం జొచ్చి వధియింపఁబడు వఱకుఁ జదివితివి. అటుపిమ్మట నర్జునుఁడు సంశప్తకులం గడతేర్చి వచ్చుటయుఁ గుమారనూరణకారణుండగు సైంధవుని మడియించుటయు మున్నగు

వృత్తాంతముం జదివినఁగాని నామది కుదురుపడదు. కావునఁ బెందలకడనే వచ్చెదను" అని చెప్పియుండెను. ఏల యింత యాలస్యముం జేసెనో కదా !

చ. అనునిమిషంబునాథుఁడు ప్రియాయనిపిల్చుచువచ్చునట్లుతోఁ
చును; రవమేది నాచెవులఁ జోకినఁగాంతుని వాజిహేషయే
యనిభ్రమఁ జెందుచుందు; సఖియా! హృదయేశ్వరుఁ డింక రాకయుం
డిన భరియింపఁజాలను; నదీతటికేఁగి కనుంగొనంగదే !

అర:—చెలీ! నీవు కలవరపడకు. ఇంకనో యిప్పుడో నీభర్త వచ్చును. ఆతఁ డేమిత్రునితోనో సంభాషించుచు నిల్చి మాట మఱచియుండఁబోలు. నే నేటియొడ్డున కాతనికై పోయివచ్చుసరికి రెండుగడియలు పట్టును. ఈలోపున నాతఁడే రాఁగలఁడు. లేనిపోని యాతురముఁ బడకు.

మల్లిక:—అసామాన్యా! నీవూరక కలఁతఁ జెందకు. నీవల్లభుని స్నేహితుఁడగు హితదాసునింట వివాహము జరుగుచున్నది. ఆతఁ డచ్చటికిఁ బోయి యుండునేమో !

అసా:—చెలియలారా! మీరేమి చెప్పినను నాసంశయము తీఱకున్నది. నానాథునిఁ బ్రత్యక్షముగాఁ జూచువఱకు నాకీ యాత్రము తగ్గదు. దుష్టుఁడగు సురాజేమైన ఘాతకసల్పి యున్నాడేమోయని భయపడుచున్నాను. ఆఘాతుకుఁ డధికారము వహించి యున్నంతకాల మేపాపిష్ఠియు నిశ్చలచిత్తముతో జీవింపనేరదు.

తే. గీ. గ్రీష్మకాలాతపనిభమై • కీడుసల్పు
నీదు గాత్మని పాలన • మేదు కెప్పుడో?
శారదామలచంద్రికా • సన్నిభమగు
చల్లనిప్రభుత్వమిలకుఁ బొసంగు టెప్పుడో?

ఉ. ఎన్నఁడు హైందవాంగనలు • వేఁచుమహాదురితాత్ముఁడౌటునో
యెన్నఁడమాయికాత్మలగు • నింతులు స్వేచ్ఛఁ జరింప నేర్తురో
యెన్నడుతల్లి నందు సుతత్రికాలిక • హీనమడంబు సుతాళికూర్చునో
యెన్నఁడు భ్రాతృభావమున • హించి జనుల్విధు లాచరింతురో.

అర:—మనమెంత కాలమో యిట్లు పరితాప పడనక్కర లేదు. న్యాయపరిపాలనా దక్షులగు నాంగ్లేయు లీదుష్టునడంచు యత్నములు రేయుచున్నారఁట. కొలఁది కాలములోనే ప్రజలయార్తి తీఱఁగలదు.

(తెఱలో)

ఆయగారమందుఁ గూర్చున్నయామెయా యసామాన్య! మా బేగమ్‌గారిచ్చిన యీకానుక యామెకు సమర్పించి పోయెద లోనికిఁబోనిండు.

ప్రవేశ మొకదాసి.

దాసి:—అమ్మా! ఎవ్వ త్తయో తెమకొక కానుక సమర్పించుటకఁటవచ్చియున్నది. పద్దోయొక పళ్ళెరమందుఁ బెట్టుకొని పట్టుకొని వచ్చినది. లోనికిఁ బంపుమని సెలవా!

అసా:—ఏమి! నాకు గానుక లెవరు పంపుదురు? అది బీగం గారు పంపిన కానుక యని యాది చెప్పుచున్నట్లు విం

టిని. నాకు బీగమ్‌గారితోఁ బరిచయములేదే? ఆశ్చ ర్యముగా నున్నది. అరవిందా! యిది యేమి మోస మోకదా! అయినను రానిమ్ము. చూతము. దాసీ! ఆమెను లోనికిరమ్మను.

(ప్రవేశ మొక మహమ్మదీయాంగన.

అంగన:—అమ్మా! ఇదే నూ నవాబుగా రీకానుక నుదమకీయు మని నన్నుఁ బంపిరి. తమరాయనకుఁ జేసిన యుపకార మునకుఁ బ్రత్యుపకారమని మనవిచేయుమనిరి. ఇదే కానుక. సెలవుదయచేయుఁడు.

(అని నిష్క్రమించును.)

(సర్వోత్సాహముతో నసామాన్యచూచుచుండును. మల్లిక పళ్లెమందున్న పదార్థమేదోయని పైని గప్పఁబడిన పట్టు బట్ట యెత్తి చూచును. సుగుణాకరుని శిరస్సుకన్పట్ట హాయనియొక్క కేకవైచి మూర్ఛిల్లును. అసామాన్య "అయ్యో! అయ్యో!" యని గుండె బాదుకొని యేడ్చును. లోపలినుండి స్త్రీ పురు షాదులందఱు వచ్చి శిరముం దిలకించి పెద్దపెట్టున రోదనములు సల్పుదురు).

అసా:—(భర్తతలఁ దన యక్కునఁజేర్చి విలపించుచు) నాథా, నన్ను వీడి నీవిట్లు లరుగ న్యాయమా? నేను సహధర్మ చారిణినిగదా! నన్నుఁగూడఁ గొంపోవలదా? నేనింత దనుకఁ జదివిన భారత కథలోని యభిమన్యునివలెనే

నీవుకూడ దుర్యోధనుని మాయావ్యూహము నం జిక్కితివా? నాబ్రతుకు కుత్తర బ్రతుకేయయ్యెనే? అయ్యో! నాకు గతియేమి? నీవు లేని నాకీ ప్రపంచమేల? హా! క్రూర! కురురాజా! నారూపముకదా నీకన్నుఁగుట్టినది. దానినేల మాపుచేయకపోయితివి? గుణనిధానమగు నా భర్త నీకేమి యెగ్గొనర్చె? నాభర్తను మడియించిన నీ యభీష్టము నెఱవేర్చుకొన వచ్చునని తలంచితివా నీచా? నేను పతివ్రతనని యెఱుంగవటరా? నేను సదా పతిననుగమించుదాననన్న సంగతి నీకుఁ దెలియదా? ఓరీ దుర్మతీ! నీకాల మాసన్నమైనదిరా!

శా. పాతివ్రత్యమె నాకుఁ గంచుఁగ మనంబందుం భావించి వర్తింతు నే
జేతో వాక్క్రియలం దకృత్యములనేనెన్నండుఁ జేయంగ లేకుండు నే
ఖ్యాతిం జెందిన సత్యపాలనముచే నాత్మేశుఁడౌ పార్థు నే
బ్రాణంబొందుసు రాజదుర్మతియసత్ మానంబుఁ గోల్పోదిక్క అత్.

ఓ ప్రాణకాంతా! నేనిదేనీతో వచ్చుచున్నాను. కొని పొమ్ము. అయ్యో! నామాట లాలింపవేమి? నావంకఁ జూడ వేమి? తెలిదామరలఁబోలి స్వచ్ఛమై నీనిర్మలభావ ప్రకటనంబు సేయు నీకన్నులేల యిట్టు లార్ద్రములై యూర్ధ్వదృష్టినే వహించియున్నవి? పూర్ణిమాశశిఁబోలు నీమోము వికాస విహీనమై యిట్లు వెలవెలఁ బారియున్నదేమి? నీతోఁ బరలోకంబునకుఁ నేను గూడ వత్తునో రానోయను అనుమానముచే నిట్టులుంటివి

వాఁడేమి ? నేను బ్రయాణ సన్నాహము జేసికొనియే యున్నాను. (కొంతసేపు నిశ్చలదృక్కులతోఁ దబ్బిరమువంకఁ జూచి) ఆహా! నే నెంత వెఱ్ఱిపడితిని. సురాజు నాకు మహోప కారముం గావించినాఁడు. వాఁడు నరమాంస భక్షకుఁడు కాఁబట్టి తనకుఁ గావలసిన మొండెంపు భాగమును దీసికొని నేను సదా వాంఛించు నా ప్రియనాథుని యుత్తమాంగమును నాకడ కంపి నాఁడు. నాకింకెక్కన్నఁ గావలసిన దేమి గలదు ? నా ప్రాణకాంతు నొద్ద నున్నాను. ఇఁకఁ బ్రయాణమెచ్చటికి ? భ్రమపడితి నిం దాఁక. నా కిప్పుడు జగమంతయు నాథమయముగాఁ దోఁచు చున్నది.

అర, మల్లిక:—తల్లీ! యూరడిల్లుము. కాని కాలమువచ్చినది.

ధారుణి:—(ఏడ్చుచు) అమ్మా ! నీవిట్లు పలవించిన నేభరింపఁ జాల. మీ తండ్రిని రానిమ్ము. ఆ పాపాత్ముని బట్టించి నీపగఁ దీర్పింతును.

అసా:—మీరందఱు పిచ్చివాండ్రు. నాకిప్పుడేమి యపాయము వాటిల్లె ? నాకు సురాజేమి యపకృతినొనర్చె ? ఇదిగో ! నేనిప్పుడు మీ మొగములు పై తము చూడలేకున్నాను. నేనేవైపు తిరిగినను నామనఃకాంతుని మోమే చూచు చున్నాను. ఆహా ! నేనెంతటి ధన్యను !

* కళ్యాణిరాగము—రూపకతాళము.

పల్లవి॥ ధన్యురాలనగుదు నేను - తరుణీబృందచయములో.

అనుపల్లవి॥అన్య మేమివలయునాకు-నాత్మనాథుకన్నను॥ధన్య

* పైపాటలోని ప్రతిపాదమును ఉత్సాహవృత్తిలక్షణమునకు సంపోవును.

1. ధరణియందు నేదిచూడ - ధవుఁడెగోచరుండగుఁ.
సరసిజేక్షణాలకునిదియ - చాలకున్నె సుఖపడఁ ॥ ధన్య॥
2. అనుభవింతు నాథుచెంత - ననుపమసుఖసంపదఁ
అనునిమిషముఁ గ్రోలుదాన - నధిప్రేమసుధలఁ ॥ ధన్య॥

ధారుణి:—అయ్యో ! అమ్మా ! నీకు నిజముగా వెఱ్ఱియెత్తినదే ! లేకున్న నిట్టితలఁ బాటఁబాడుదువే ! భగవంతుఁడా ! నాకేదిదారి ? అల్లునిఁ గోల్పోయితిని. ఉన్న యొక్క కూఁతురా ఇట్లు మతిచెడినదయ్యె. ఎంత ఐశ్వర్యమున్న నేమి ? ఎవరనుభవింతురు ?

(ప్రవేశము మతఙ్గుఁడు మిగుల నాతురముతో.

మత:—హా ! కుమారీ ! నీకెంతగతిపట్టినదే ! (అని మూర్ఛిల్లును అతని భార్యయున్నగునా రుపచారములు చేయఁ దేఱుకొనును.) అమ్మా! ఎంతచేటువాటిల్లె ? ఆసురాజపుత్రకుఁ డెంతఘాతుకుఁడయ్యెను. (పండ్లు పటపటఁ గొఱుకుచు) ఓరీ ! దుర్మదాంధా ! వంచకా, నీకుఁ జావుమూడినదిరా ! లేకున్న సింగంబునింటఁజొచ్చి విహరింప నీకుఁ సాహసమెట్లుగల్గు ! ననిదే యీశేయినేపోయి యాంగ్లేయ ప్రభువులగు క్రైస్తవ ప్రముఖులతో మంత్రనముసల్పి నిన్ను మట్టుఁబెట్టించెదరా ! అయ్యో, (గుండెఁ గొట్టుకొనుచు) అట్లు చేసినను నాకూఁతు నా స్థితిరుదెట్లు అనుగుణాకరుఁడెట్లు వచ్చును? దీనికిఁ బిచ్చియెత్తినట్లు

తోఁచుచున్నది. ఇది కుదిరి బ్రతుకు టెట్లు? నాకుం గొడుకైనం గూఁతురైన నిది యొకర్తుకయే కదా. ఓ దేవా నా కిన్నకూఁతునైన నాకు క్షేమముగా నప్పగించి రక్షింపుము.

(అందఱు దుఃఖింతురు) (తెరపడును.)

---

## తురీయరంగము.

రంగము:—మతబ్చందునిగృహములోనొకగది.

ప్రవేశము:—మతబ్చందుఁ వానిభార్య ధారుణీదేవియు.

మత:—దేవీ, ఇన్నాళ్ళకు లోకము నిష్కంటకమైనది. నా ప్రయత్నములన్నియు సఫలములైనవి.

ధారు:—ఎట్లు? వివరముగాఁ దెలుపఁగోరెదను.

మత:—నేనాంగ్లేయప్రతినిధియగు క్లైవుతోను సురాజుచుట్టమగు మీర్జాఫరుతోను నాలోచించి సురాజునోడించి పదభ్రష్టునిఁజేయు నుపాయమును వెదకితిని. నాధన సాహాయ్యమున వారు సురాజుపై దండెత్తనిశ్చయించి వాని కడకు రాయబారినంపిరి. ప్లాసీయొద్ద నుభయ సైన్యములును మొన్న తారసిల్లినవి. దుష్టుఁడగు సురాజున కొక్కబందుగుఁడైన సాయపడలేదు. వానిసైనికులే వానిని మోసమొనర్చి సమయమునకు వెనుకకు దగ్గి ప్రాణములఁదక్కించుకొని పాఱిపోయి శత్రుసేనలం

గలసి?. అతఁడు నిలువ నీడఁ గానక పలాయనుఁడయ్యెను.

భారు:—పాపము వానితో నెవ్వరును బోలేదా ?

మత:—వాని ప్రియభార్యయగు మెహర్న్నిసా బేగమ్మాత్ర మాతని ననుసరించి యుండెను. తక్కుంగల భార్య లెల్లరుఁ దమకందిన ధనముఁ జేర్చుకొని పాఱిపోయిరి. కష్టములయందైన బతినెడఁబాయని సతియేకదా సతి ?

భారు:—ఎక్కడనో దుష్టురాండ్రగు స్త్రీలు నూటికొకరిద్దఱు మాత్రిమట్లు భర్తలఁ గష్టసమయమున విడిచిపెట్టువారు మన హిందూదేశమునఁ గలరు. పురుషునకు ధనము లేకున్నఁ గలికాలమునఁ గులసతియు రోయునని కొందఱు కుకవులు వ్రాసినవ్రాతలు కల్లలని నా యభిప్రాయము. హైందవాంగనలకుఁ గల భూషణము సుఖదుఃఖములఁ బతిననుసరించుటయే.

తే. గీ. నాథ ! హైందవదేశము • న జనియించు
నాఁడుఁబిడ్డయేనియుఁ బోతు • వీడనప్పుడు
జ్ఞానసంపన్నలౌ మను • జసతులెట్లు
హృదయకాంతుల విడిచి వ • ర్తింపఁగలరు !

మత:—నిజము. పాపమూ బేగమ్ పదునెన్మిదేండ్ల యీడుమాత్రమే గలుగుయువతి. నిండుచూలాలు. పతితోఁ గాలి నడకను గ్రామగ్రామములఁ దిరిగినఁదట. తుదకు వారు

బాగాబంగోలాగ్రామమున నొక పేదవానియింటఁ దలదాచుకొనియుండ నాయువతి యొక స్త్రీ శిశువును ప్రసవించెనఁట. ఆ దినముననే సురాజు మారువేషముతో నెందులకో యీవలకురాగా మీర్జాఫరుని కొడుకు మిరాన్ వానితలఁ దీయించెనఁట. మాకు వానిని సింహాసనమునుండి తొలఁగింపవలయుననియే కాని, చంపవలయుననెడి సంకల్పములేదు. కాని దైవసంకల్పమట్టులున్నది. దుష్టుఁడు తెగియెను. నేఁడాతని శిరంబొక కుంతంబునకుఁ గ్రుచ్చి యూరేఁగింతురఁట. ఇఁక మీర్జాఫర్ నవాబగును. అతఁడు మనకనుకూలుఁడే.

ధారు:—వాఁడెట్టి దుర్మార్గుఁడైనను నాకు వాని గతినిగూర్చి విన్న జాలికలుగు చున్నది.

మత:—దాని కేమి ? మనయసామాన్య కున్మాద చికిత్సఁగూర్చి మీాయన్న నాకొక యుపాయముఁ జెప్పియున్నాఁడు. దాని నాచరింతుమా ?

ధారు:—అదియేది ? ఎటులైన మనపిల్ల స్వస్థచిత్తయై మనుటయే కదా మనకోరిక ?

మత:—నేఁడు జరుగనున్న యుత్సవమునకు మన యమ్మాయిని గొనిపోయి, దానిభర్తను బొలియించిన దుష్టుని శిరమామెకుఁ జూపిన దాని పిచ్చి కుదురవచ్చునని నీయన్న వచియించినాఁడు. ఇదివఱకు మనమెన్నియో

చికిత్సలఁ జేసి చూచితిమి. అన్నియు వ్యర్థములయ్యెను. ఈయత్నముకూడఁ జేసెదముగాక. ఒకసారి యమ్మా యినిటకుఁ దెమ్ము. (ధారుణిలోనికేగుఁను.) (తనలో) ఆహా! భగవంతుని మాయ! మనము తలఁచినట్లు కార్యములెల్ల జరగిన నిఁకేమికావలయును? నాయపార ధనసంచయములు నాముద్దుల యల్లునకర్పించి కూఁతురు తనమగనితో సుఖయించుచుండఁ జూచుచు నానంద మొందగోరిన మాకెట్టిగతి పట్టినది? అమ్మాయియైన నారోగ్యవతియైయుండినఁ గొంత యూరడిలియుందుము.

(ప్రవేశము—అసామాన్యాధారుణులు.)

మత:—అమ్మా! ఈ దినమున నీశరీరస్థితి యెట్లున్నది?

అసా:—నాన్నగారూ! నాకేమియు రోగములేదే! ఏలయిట్లు ప్రశ్నించుచున్నారు? మీకు మతిపోయినదాయేమి? నేను మహానందములో మునిఁగియున్నాను.

చ. శ్రవములకెల్ల వేళల మ • రందనిభంబగు నాథుకంఠము‌న్
జవిఁగొననెద్దియేనియు మ • నఃపతి ప్రేమసుధాప్రవూరము‌న్
బవనపుఁదాఁకుడైనఁ బ్రియ • భర్తసుకోమలహస్తసౌఖ్యము‌న్
బ్రివిమలవస్తువేదిగని • నం బతిమూర్తియుఁ దోఁచునాకిలన్.

ఈమంచముపై నానాథుఁడే. (తల్లినిముట్టి) ఈస్వరూపమునాథుఁడే. ఈముకురమునందు నాథువిగ్రహమే. (వళ్ళెము

లోనున్న తమలపాకులజూచి) ఇవే నానాథుని యడుగులు. (పంజరములోఁ జిలుకపలుక విని) అవే నానాథుని పలుకులు.

మత:—(తనలో) కటకటా! ఎట్లుదీనికి స్వస్థతకల్గును? (ప్రకాశముగా) అమ్మా! నీవు చెప్పినదంతయు నిజమే. నీవును మాయమ్మయునుఁ గలిసి యొక యుత్సవమును జూడఁ బోయెదరా?

అసా:—మాయమ్మయెవరు? నానాథుఁడే. "నీవును నీనాథుఁడును" అనుము.

మత:—(నిట్టూర్పువిడిచి) సరే. నీవును నీనాథుడును బోయి యొకయుత్సవముఁ జూతురా?

అసా:—మాపరస్పర సంభాషణ మహోత్సవమేకదా! మానవక్రీడా మహోత్సవమేకదా? మావిస్రంభాలాప మహోత్సవమేకదా?

మత:—(మరలదుఃఖించి) అవునదియే. పోయిరండు. (మెల్లఁగా భార్యచెవిలో) నీవు మల్లికారవిందల వెంటఁబెట్టుకొని యమ్మాయిని నడుమ నుంచుకొని మనమేడ నాల్గవయంతస్థుపైఁగూర్చుండి యిఁక నొకగడియలో బయలుదేఱు నూరేగింపును జూచిరండు అమ్మాయికి సురాజు శిరస్సును గూర్చి యంతయు వినిపింపునో. దాని పర్యవసానమేమిజరగునో చూతము. పొండు. (బిగ్గఱగా) అమ్మా! వెడలిరండు. నేఁబోయివచ్చెద.

అసా:—(పాడును) ద్విపద:—

నాథునిచెంతను - నాట్యమొనర్తు
నాథుకరంబున - నాకరమునుంతు
నాథుమఱుంగున - నక్కుచుమింతు
నాథుముఖంబున - నవ్వుచునుందు
నాథుపదాబ్జను - నమ్రితంబునుడు.
నాథునిముందర - నానయిం కేల ?
నాథుండెనా స్త్రియు - నాళియునాకు
నాథుండెసర్వము - నాకిలలోన.

(అనుచుం దల్లితో వెడలును.)

---

పంచమరంగము.

రంగము:—అసామాన్య శయనగృహము.

ప్రవేశము:—అసామాన్య.

అసా:—ఇది కలయో నిక్కువమో తెలియదు. నేను స్వర్గము నుండి నరకమునకుం బంపం బడితిని. ఓ దైవమా ! నాకింతలో నీయున్మాదనివారణ మేలచేసితివి ? ఇంతదనుక నిహలోకదుఃఖము లేవియు నాకెఱుకపడకుండెను. ఇప్పుడు మరల నన్నీదుర్గతికేల తెచ్చితివి ? నాయానంద మేమాయెను.

తే. గీ. నాథునానందమో జగన్నాథుముదమొ
యనుభవించితినిన్నాళులవిరతముగ
లక్ష్యము మఱుఁగుపడెఁ; బక్షులొగిఁదూలె
దివ్య తేజమెడలె ; నిరుల్ దిశలఁబర్వె.

నిరంతరమును బ్రియుని సాన్నిధ్యగరిమననుభవించుచుంటిని. ఇప్పుడదియంతయుఁబోయె. సురాజువిషయమై నేను జేయవలసినవని భగవంతుఁడేచేసెను. ఇఁకఁ బరమేశ్వరుఁ డొనరింపవలసిన కృత్యమొకటి నేనాచరింపవలసి యున్నది.

ప్రవేశము—అరవింద.

అర:—అసామాన్యా? "పరమేశ్వరుఁ డొనరింపవలసిన కృత్యమొకటి నేనాచరింపవలసియున్నది." అంటివిఅదియేమి ?

అసా:—మఱేమియు లేదు. ఏదో నా వెఱ్ఱిమాటలలో నదియొకటి.

అర:—అట్లుగాదు. ఇప్పుడు నీవివెఱ్ఱిమాటలుగావు. సురాజు శిరస్సునుజూచినదాది నీయున్మాదము మంచువిరిసినట్లు విడిపోయినది. నీకా నిముసమందే తెలివివచ్చి ఈయుత్తమాంగమేనిర్భాగ్యునిది! పాపమీతని సతినాకన్నను భాగ్యహీనురాలు కాబోలు" నంటివికదా? నీకా శిరోదర్శనమే సంజీవిప్రాయమయ్యెను. నేను నీకుఁగడుఁగూర్పుదానను గదా! ఆపరమేశ్వరుఁ డొనర్పింపవలసిన పనియేదో నాతోఁజెప్పవా ?

అసా:—నీవు కడురహస్యముగా నుంతువేని చెప్పెద. ఈసంగతి నీవును నేనును దప్ప మూఁడవప్రాణియెఱుఁగరాదు.

అర:—(చేతిలో చేయివైచి) ఇదేయొట్టు నే నెవరితోఁ జెప్పను. చెప్పుము.

అసా:—సురాజుపైఁ బగదీర్చుకొనవలసిన పనినాది. అది దేవుడే తీర్చినాడు. పరమ పతివ్రతాతిలకమగు మోహనాంగి గా వేగమును దత్పుత్రను గాపాడుభారము భగవంతునిది. అత్తఁడు పేక్షించి యూరకున్నాఁడు. నేనాకార్యమును బూనుకొనవలెను.

అర:—నీవేమి చేయఁగలవు ? ఆమె శత్రుభయముచే నేవల్లెలో నో దాఁగుకొన్నదఁట.

అసా:—అంతయుఁ గనుఁగొన్నాను. ఆమె బొంగాంగోలా గ్రామములో నొక కుమ్మరివానియింటఁ దలదాఁచుకొనియున్నదఁట. మాజననీ జనకులతో వచియింపకుండ నీవును నేనును నేటి రాత్రిబయలుదేఱి యచ్చటికి వెళ్ళియామెవెఱపునుబోగొట్టి కొనిరావలయును. నాభర్తయాస్తియు, నాతండ్రినాకిచ్చు నాస్తియు, నామెకుమారితకిచ్చి నేను ధన్యను గావలెనని నిశ్చయించుకొంటిని. నాతో బయలువెడలుటకు నీకేమేని యభ్యంతరము గలదా ?

అర:— నీవేపని చేయుమన్న నేఁజేయ సిద్ధముగానున్నాను.

అసా:—విరోధి యెంతదుష్టుఁడైనను, సతనియిల్లాలు సాధ్వియైనచో నామె రక్షణముఁజేసి మఱియొకపని జేయవలెను. లేకున్న నామెశాపముచే లోకంబాకులంపడును.

చ. పరమశివుండునైత మల ♦ భావజుసూపము మూపఁగల్గియుఁ
వరసతియారతీరమణి ♦ వాక్యమయూఖము లేఁచునన్భయం
బఱిమిఁ జవెట్టనొక్కవర ♦ మా రతికిచ్చి యనుగ్రహింపఁడే!
ధరణిఁ బతివ్రతామణుల ♦ దాపు కలంపదెయెంతవారలన్.

కావునఁ బ్రయాణమునకు సిద్ధపడియుండుము. భోజనమునకుఁ బోయి వత్తమ్మ రమ్ము. (నిష్క్రమింతురు.)

---

## షష్ఠరంగము.

రంగము:—బొగాబంగోలాలోని కుమ్మరివీధి.

ప్రవేశము:—శిశువుతో మహార్నిణాబేగమ్.

మహ—ఆహా! కాలగతి! ఎట్టియవస్థ నాకుఁగల్గెను! అనవరతము హంసతూలికాతల్పమునందెకాని కాలిడని నేనిప్పుడీకటికనేలఁ జరింపవలసివచ్చెఁగదా! వేనవేలుచేటికలు సదా నన్నుఁగొలువ నఖండసుఖ మనుభవించు నేనొంటికత్తెనై తోడును నీడయులేకతిరుగనలసెఁగదా! నాప్రాణకాంతుఁడు లోకులయెడ నెంతదౌష్ట్యముంగనఁబఱుచువాఁడో, నాయెడ నంతప్రేముడిఁ జూపువాఁడై ఁగులో అను ముద్దుపేరుతో నన్నుఁబిలుచుచు, నామనోభీష్టములందీర్చు కల్పతరువైయుండ, నాకేలోపమును దోఁపదయ్యె. ఇప్పుడు నాబ్రతుకెందునకుం గొఱగాకుండె.

ఏమి ! ఈకాలమైన పరీక్ష్యము ! కాలమా ! నీవు నిమేషములో మూర్ధాభిషిక్తులకు ముష్టిపాత్ర చేతికిత్తువుగదా! నీకు దయయున్న క్షణములో యాచకునికి రాచరిక మీయఁగలవు.

ఉ. శ్రీలకు వాసమైతనరు ♦ సీమలు భూతపిశాచసంఘముల్
చాలిచరించుఘోరమగు ♦ వాటికలౌ; శవదాహయోగ్యమౌ
చేలు సుసౌధసంచయము ♦ చేనలరారు మనోజ్ఞభూములౌ
కాలము చేయలేనిదొక ♦ కార్యము లేదు ధరాతలంబునన్.

దేవా! పూర్ణగర్భవతినయ్యుఁ బ్రియభర్తకొఱకు నెండయనక, వానయనక, గాళ్ళనక, ముండ్లనక పరిభ్రమించితిని. కాని నాకష్టమంతయు వ్యర్థము చేసి నాగర్భవేదనయు నాథుమరణవేదనయు నొక్కసారి కలుగఁజేసితివిగదా! "ఇదే నీకొఱకు మంత్రసానిని దీసికొని వత్తు" నని వెడలిన నా నాథుని మరల నాకంటఁ బెట్టకపోయితివి గదా! నాపై నీకింత పంతమేల ? నేను నీకేమి యపకారము నర్చితిని. ఎంత మహదైశ్వర్య మనుభవించుచున్న నిన్ను మఱచియుండనే ! ఆబాధలన్నియు నోర్చి యీ చిన్ని కందువు కొఱకుఁ బ్రాణములు నిల్పుకొని యొక ఘటకారు నింటఁ దల దాఁచుకొని యుండ నదియు నీకుఁ గిట్టకుండెనా ? ఏపాపమెఱుఁగని యీ పసికూన నిన్నేమిచేసినది ! దీనిని వధింప విరోధులనేల పురికొల్పి నాకడ కంపితివి ? (ఏడ్చుచు) ఓకరుణాస్వరూపా ! నీబిసు

దును నిల్పుకొనుము. నాపై నాబిడ్డపై ననుకంప వహింపుము. ఒరుల కెఱుఁగరాని చోటుఁ జూపి కాపాడుము. ఎవరో యిరువురు స్త్రీలు నాకై తిరుగుచున్నారఁట. తండ్రీ! నీవే దిక్కు. నిన్ను నమ్ముకొనియే యీవన మార్గముం బట్టి చనుచున్నాను. నన్నుఁ గడతేర్చినను సరియే. ఈ లేఁత కందును మాత్రము భూమిపై నుంచి వంశము నిలుచునట్లుచేయుము. (ఒడియందిడుకొన్న శిశువువంకఁ జూచి) అయ్యో వెఱ్ఱి తల్లీ!

తే. గీ. ఏల కన్గలమని నవ్వె ♦ దీవు తనయ!
అరయవింతైన నిన్నెట్టు ♦ నాపదలను
క్రూరరోయు కిరాతుని ♦ జాడఁగనక
క్రేళ్లువాఱు లేడి కొదమ ♦ రీతి నకట.

అదే దూరమున నెవ్వరివో రెండాకృతులు కనఁబడుచున్నవి. ఇచట నిలువ క్షేమముగాదు. దైవముమీఁద భారము నైచి పోయెదఁ గాక.

(నిష్క్రమించును).

(ప్రవేశము:—అసామాన్యారవిందలు).

అసా:—అరవిందా! ఈదారినేకదా గల్ వెడలినదని యూరికాఁపువాండ్రు చెప్పిరి. ఈ నేలపై గొన్ని యడుగుల గుఱుతు లస్పష్టముగాఁ గన్పట్టుచున్నవి. ఇవి యామె యడుగులేయైయుండవచ్చును.

అర:—(పరిశీలించి) అసామాన్యా! ఇవి నిక్కువముగా నామె పాదచిహ్నములే. ఏలయన నిందు సూక్ష్మదృష్టితోఁ

జూడఁ జక్రిచిహ్నములు కనిపించుచున్నవి. అట్టివి మహారాజులకుఁ బట్టమహిషులకు మాత్రమే యుండునని సాముద్రిక శాస్త్రజ్ఞులు చెప్పుదురు.

అసా:—కావచ్చును. మనమీ జాడను బట్టియే పోదము. శ్రమయని యెంచక తిరిగితిమేని యీస్వాయంతకాలములోపున మన మామెను బట్టుకొనఁగలము.

రా. శీఘ్రముగా నడుగులువై చెదము. (నిష్క్రమింతురు).

---

## సప్తమరంగము.

రంగము:—గంగానదీతీరము.

(ప్రవేశము:—రయాగతి బిడ్డతో నుక్కొగన్).

గల:—హా! దైవమా? నన్నింత కష్టపెట్టుచుంటివిరా! ఇదివఱకు నన్నుఱచిన పాట్లు చాలవఁటరా? నిద్రాహారములు మాని యూరూర నేఁడాది నుండి తిరుగుచుంటిని; ఇంకను నీకసి తీఱ లేదటరా? ఇన్ని యిడుమలఁ బడుచున్నను నీవు దయామూర్తివనియే విశ్వాసమును గల్గియున్నాను. నేఁటిపఱి కాదుష్టురాండ్రకంటఁ బడకుండ దాఁటుకొనివచ్చితిని. వారదే కూఁతవేటుదూరములో నున్నారు: ఏదో యఱచుచున్నారు. ఈ తుపానుగాలిచే నాకేమియు వినఁబడుట లేదు. ఓయూవన్ని

వారకా ! ఇదే కడపటి ప్రయత్నము చేయుచుంటిని; ముంచినను తేల్చినను నీదియే భారము. (నది యొద్దన నున్న పడవవాండ్రను సమీపించి) నాయనలారా ! నేనొకయనాథను. నన్ను శత్రువులు తఱుముకొనివచ్చుచున్నారు. వారీపూపటింద నను ద్రెంపఁ జూచుచున్నారు. నన్నిటులైన నది దాఁటించి పుణ్యము గట్టుకొనుఁడు. నాకుఁ బుత్రభిక్షముఁ బెట్టుఁడు. (అని యొకనిపాదములపైఁ బడును).

ఒకపడవవాఁడు:— అమ్మా ! నువ్వెరో దేవతలా వున్నావు. పాపం నిన్జూస్తే మూకు జాలేస్తంది. కాని, యీ తుపానుగాలిలో పడవ నీలలో యెయ్యటానికి మార్గాముగదా. బమ్మదేవుడికైనా శరంగాదు. ఈ గాలి తగ్గే నీకోర్కె తీర్చగలం.

రెండవ:—ఒరే. ఈతల్లిరేదో రాణీవోర్లావుందిరా. ఈయమ్మేడుత్తూంటే నాగుండె నీరై పోతూందిరా. ఏంవైనా సరే. నాపడవేత్తానురా.

మూడవ:—ఓరీ, చత్తావురా నీవుసావడంగాకుండా ఆయమ్మను సంపుతావురా !

గుల్:—నాయనలారా ! మీరీగాలికి భయపడవలదు. అది నన్నేమియు జేయఁజాలదు. దీనికన్న ఘోరములైనవాని నెన్నొకని జయించి వచ్చితిని. మాటలకు వ్యవధి లేదు.

ఇదిగో వజ్రపుటుంగరమును బహుమానముగా నిచ్చు
చున్నాను. ఇది యమ్ముకొన్న నొక సంస్థానమును గొన
వచ్చును. వేగనావకట్లు సడలించి నన్నంపుఁగొనిపొండు.

అందఱు:—(కొంతసేపు గుసగుసలాడుకొని యుంగరముం బుచ్చుకొనుటకు సమ్మతింతురు. ఒకఁడొక పడవలోనికిఁ గుల్ బేగము నెక్కించుకొనును. గుల్ బిడ్డను బైటచెఱఁగుతో వీఁపునకుఁ గట్టుకొని యీశ్వరధ్యానముం జేయుచు బడవలో నాసీనయగును.) ఓలెస్సా, బేలేస్సా, ఓలెస్సా బేలెస్సా (అని పడవను నెట్టుకొని పోవుదురు.)

ప్రవేశము:—అసామాన్య.

అసా:—అక్కటా! నాప్రయత్నంబును వ్యర్థమయ్యెను. కడు దాపునకు వచ్చియు నాయునతిని గలిసికొనలేకపోయితిని. అరవిందమాలయను నిట్టిభంగము ఘటస్థించినది గదా! దానికాళ్లలో నిట్టి పాదములేల గ్రుచ్చుకొనవలయు? అదియేమో మిన్నువిఱిగి మీఁదఁబడినట్లు పరితాపపడనేల? దానికి జికిత్స చేయుచు నేనువృథాగా నమూల్యకాలమును బోఁగొట్టనేల? అదియూ నాతో రాలేక రెండుకోసులు వెనుక నుండి పోయినది. నేనావాయు వేగమునఁ బ్రేవులు తెగునట్లు పరుగెత్తుకొని వచ్చినను గుల్‌ను గలిసికొనఁజాలకుంటిని. దైవమా! ఇప్పుడేది తెరువు? ఫలోన్ముఖకార్యమును వినాశమొనర్చితివే! నీసంకల్పమేమో యెవ్వరికిని గోచరముకాదయ్యె.

గీ. ఎండమావుల వెనువెంట • నేఁగు దప్పి
గొన్నహరిణికరణి నేను • గొండలనక
వాఁగులనక తిరిగియుంటి • వ్యర్థముగను ;
కృషికి నీవు తోడ్పడుదంట • మృషయయగునె!

(దూరముగా వీక్షించి) కటకటా! ఓడ వాయువేగమునఁ దలక్రిందగుచున్నట్లున్నది! అదే మునిఁగిపోవుచున్నది. ఇఁకఁ దడయరాదు. ఏటికడ్డమీఁది యామెను బ్రతికింతుఁగాక. (అని కోకబిగియించి నదిలో దుముకును. రయగతి నోడబోరగిల్లిన చోటునకుఁ బోయి మునుకలు వేయుచున్న గుల్‌బేగమును జడపట్టుకొని, శీఘ్రముగా నొడ్డునకుఁగొనితెచ్చును. పరీక్షించి చూడ గుల్ ప్రాణములు విడిచినట్లుతోఁచును. వెనుక వీఁపునకుఁ గట్టఁబడ్డ శిశువు సజీవమై యుండును. అసామాన్య నిర్వేదపడి) అయ్యో! నాప్రయాసమంతయు వృథయయ్యెను. నేను దారిఁబోవువారలచే సీమెకుఁ బంపిన వార్తల నీమె నమ్మలేదు కాఁబోలు. నేను శత్రువునుగానని సందేశములు పంపుటయేకాక యెదుటఁ గనఁబడినప్పుడు గొంతెత్తి యఱచితిని. నాదియరణ్యరోదనమై యుండనోపు. సమయమున కీపావపుఁ బ్రభంజనుండు తన పేరు సార్థకముఁ జేసికొనుటకోయన నా మాటలు కూడ నణఁచివైచినాఁడు. నేనే యీయమ మృతికిఁగారణమైతిని. ఎంత మహాపాతకముం గట్టుకొంటిని! పరాత్పరా! నీచెయిదములు విపరీతములు.

ఉ. నీయనుకూలతన్బడయ • నేరనిపాపిని, వినిర్మలాత్మతోన్,
న్యాయము మీఱకుండియును, బ్ర • యత్నపుగోపము గల్గనీకయున్
రేయిబవళ్ళు పాటుపడి • నిష్ఠవహించియు, భగ్నకార్యుడన్;
వాయువువర్షముల్ దెగిన • వ్యర్థమెకాకృషికారుయత్నముల్

ఆహా ? ఏమి యీమె సౌందర్యము ! ముఖమునుండి యిప్పుడు సైతము సౌమ్యతేజంబు ప్రసరించుచున్నదే ! ఇట్టి లావణ్యవతియగు సుగుణాల పేటికతో స్నేహభాగ్యము నిర్భాగ్యురాలనగు నాకెట్టులబ్బును ? ఈమె కుపచారములొనర్చి తనుపటకమూలుగా ఖననసంస్కారముం జేసి యుపచారమొనరింపవలసివచ్చెఁగదా! అంతమాత్రపు సేవయేని యీచరితార్థశరీరిణికి జేయఁగల్గుటయు నాయదృష్టమే. ఈశిశువేని ప్రాణములతో లభించినందులకు భగవంతునిఁ గొనియాడవలసినదే. ఆసర్వజ్ఞుని సంకల్పమట్టిదేయని భావించి యూరడిల్లుటయొప్పు. ఇప్పుడీయనాథ ప్రేతకు ఖనన సంస్కారముం గావించి, యీబిడ్డ నెత్తుకొనిచని, యరవిందం గలసికొని, మత్పురంబున కేఁగెదఁగాక. మహాత్మ్మ దీయ జాతియందుఁ బుట్టినదయ్యు నీకందువే నాకుఁ బెంపుడుఁ గూఁతురై నాయాస్తికిఁ గర్త్రియగుఁగాక.

పల్లెవాండ్లు:—(ఆమెవిధముంగని యచ్చెరువొంది) అమ్మా ! దండాలు. నీవు భూదేవతవు తల్లీ! నీవు నూఱేళ్ళు బతికెదమ్మా.

# రామా అండ్ కో ప్రచురములు.

| | | | | |
|---|---|---|---|---|
| అక్షరాభ్యాస సహకారికా చిత్రలేఖనము | | | | |
| I వ భాగము | | 0 | 2 | 0 |
| డిటో II వ భాగము | | 0 | 2 | 6 |
| రామా మొదటి వాచకము | అప్పృవుడు | 0 | 2 | 6 |
| రామా రెండవ వాచకము | డిటో | 0 | 3 | 0 |
| మొదటి తరగతి నాటకముల కథలు | అప్పృవుడు | 0 | 2 | 0 |
| రెండవ తరగతి | డిటో | 0 | 2 | 6 |
| మూడవ తరగతి | డిటో | 0 | 3 | 0 |
| నాల్గవ తరగతి | డిటో | 0 | 4 | 0 |
| ఐదవ తరగతి | డిటో | 0 | 5 | 0 |
| రెండవ తరగతి లోకజ్ఞానము | డిటో | 0 | 3 | 0 |
| మూడవ తరగతి డిటో | డిటో | 0 | 4 | 0 |
| నాల్గవ తరగతి డిటో | డిటో | 0 | 5 | 0 |
| ఐదవ తరగతి గి॥ వెంకటరామమూర్తిగారిచే | | 0 | 8 | 0 |
| లోకజ్ఞానము 2-3-4 తరగతులకు ఒకే పుస్తకము | | 0 | 10 | 0 |
| సివిక్సు పాఠములు 2-3 తరగతులకు | | 0 | 1 | 6 |
| సివిక్సు మ్యాన్యుయల్ 4-5 తరగతులకు | | 0 | 8 | 0 |
| మొదటి తరగతి పద్యవాచకము | అప్పృవుడు | 0 | 1 | 6 |
| రెండవ తరగతి ,, | డిటో | 0 | 1 | 6 |
| మూడవ తరగతి ,, | డిటో | 0 | 2 | 0 |
| నాల్గవ తరగతి ,, | డిటో | 0 | 2 | 0 |
| ఐదవ తరగతి ,, | డిటో | 0 | 2 | 6 |

వలయువారు:- రామా అండ్ కో. ఏలూరు.

వేంకటరామ్ అండ్ కో. బెజవాడ.